శ్రీ

# లంకాదహననాటకము.

నాలుగంకముల

తెలుఁగు నాటకము,

ఇది

బళ్ళారిలో వకీలుగానుండిన

కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

1924



వెల రు. 1—0—0

# పీఠిక.

ఇపుడు గొన్ని సంవత్సరముల క్రిందటఁ జెన్నపురినుండి గోవిందస్వామినాయకర్ నాటకసంఘమువారు వచ్చి లంకాదహన నాటకము నత్యద్భుతంబుగఁ బ్రదర్శించిరి. అందున నాంజనేయ పాత్రను ధరించినవాఁడు భక్తిరస మచ్చెరువుగ గనపఱిచెను. దానింగని సుమనోరమసభవారు తమకును నానాటకముఁ గావలెనని నేఁగోరిరి. రుగ్మతవలనను, గార్యబాహుళ్యమువలనను దీరికలేక యొకలేఖరితో వ్రాయించితిని. గోపీనాథ రామాయణ మిప్పనికి నపుడునాకు సాహాయ్యపడెను. పద్యములల్లవసతిలేని కారణంబున నారామాయణములోని పద్యములే సభవారుపయోగించుకొనిరఁట.

ఇపుడీ నాటకమును ముద్రింపింపనెంచి చూడఁగ వ్రాఁతయంతయును దప్పులముద్దగ నుండెను. పద్యములెల్లను నూతనముగ వ్రాయవలసివచ్చెను. నూతనముగ నాటకము వ్రాయుటకంటెను సంస్కరించుపని నాకు హెచ్చుకష్టమిచ్చెను.

ఈ నాటక కథాసందర్భమా బాలవృద్ధులకుఁ దెలియును గావున హెచ్చువ్రాయుట యనవశ్యకము.

ఇటని విన్నవించు సుజనవిధేయుఁడు,

కోలాచలం - శ్రీనివాసరావు.

8 - 3 - 1919.

## నాటకములోవచ్చుపురుషపాత్రములు

శ్రీరాములు
లక్ష్మణుఁడు
వాలి
సుగ్రీవుఁడు
ఆంజనేయుఁడు
అంగదుఁడు
జాంబవంతుఁడు
నీలుఁడు
గజుఁడు
గవాక్షుఁడు
గవయుఁడు

శరభుఁడు
గంధమాదనుఁడు
మైందుఁడు
ద్వివిదుఁడు
సుషేణుఁడు
రావణుఁడు
విభీషణుఁడు
అకంపనుఁడు
మారీచుఁడు
ఇంద్రజిత్తు
అక్షయుఁడు
రాక్షసులు

## స్త్రీపాత్రలు

సీత
తార
శూర్పణఖ
లంకిణి

త్రిజట
ధాన్యమాలి
దుర్ముఖి
రాక్షసస్త్రీలు

శ్రీ

# కథాసంగ్రహము.

### ప్రథమాంకము - ప్రథమరంగము-

శూర్పణఖ రావణునిజేరి శ్రీ రామలక్ష్మణులనుండి జరిగిన పరిభవము తెలుపుట. రావణుని నిందించుట. సీత సౌందర్యాతిశయములను వర్ణించి ఆవిడ నవహరింప పురికొలుపుట.

2-వ రంగము. రావణ మారీచుల సంవాదము. మారీచుడు రావణునికి బుద్ధిచెప్పుట రావణుడు మారీచుని గండింతునని కోపగిల్లుట. అందుకు మారీచుడు మాయామృగమగుటకు సమ్మతించుట.

3-వ రంగము. శ్రీరాములు సీత యుపవనమున విహరించుచుందురు. సీత మాయామృగమునుచూచి ఆ మృగము తనకుబట్టియివ్వమని పతినివేడుకొనును. శ్రీరాములు అందుకుసమ్మతించి లక్ష్మణుని కావలిగావుంచి, శ్రీరాములు మృగమును పట్టబోవును. మారీచుడు రామబాణ హతుడగునపుడు "హాసీతా హా లక్ష్మణా" అని యరచుట. సీత యాశబ్దమువిని లక్ష్మణుని తనపతికై సహాయ్యమునపొమ్మని నిందించును. లక్ష్మణుడు వెడలిపోవును. సన్యాసి వేషమున రావణుడు సీతయొద్ద ప్రవేశించి సీత నెత్తికొని పోవును.

4-వ రంగము. శ్రీరామలక్ష్మణులు ఆశ్రమమునకు వచ్చి సీతనుగానక విలపించి సీతనెదకుటకు బోవుదురు.

### ద్వితీయాంకము - ప్రథమరంగము

సీతకై శ్రీరాములు విలపించుచుండ సుగ్రీవాంజనేయులు దూరమునుండి వారిని చూచుట. ఆంజనేయులు సుగ్రీవుని దూరమున నిలిపి శ్రీరామలక్ష్మణులను సందర్శనముచేసికొనుట. ఆంజనేయులకు శ్రీరాములకు జరిగిన సంభాషణ.

2-వ రంగము. శ్రీరామలక్ష్మణుల సరసకు ఆంజనేయుడు సుగ్రీవుని పిలుచుకొని పోవుట శ్రీరాములకు సుగ్రీవునికి జరిగిన సంభాషణ. వారిరువురికి సఖ్యము సంఘటిం చిన ప్రమాణము.

3-వ రంగము. వాలిసుగ్రీవులకు జరిగిన మొదటియుద్ధము. సుగ్రీవుడు క్రిందబడి లేచి రాముల చేరి రాములను నిందించును.

4-వ రంగము. సుగ్రీవుడు మరల యుద్ధములో ప్రవేశించి ద్వంద్వయుద్ధము చేయుట. వాలి రామబాణ హతుడై క్రిందబడి రాములనునిందించి మర్ల అవసాన కాలమున శ్రీరాములను స్తుతించును. శ్రీరాములు వాలికి మోక్షమిచ్చుట. తార అంగదులువచ్చి విలపించుచుండుట. వాలి, తార అంగదులను రక్షిం చుమని సుగ్రీవుని వేడుకొని రాములను తలచుచు ప్రాణంబు విడుచును.

## తృతీయాంకము - ప్రథమరంగము

శ్రీరాములు సీత సౌందర్యాతిశయములు ఆంజనేయులకు తెలుపుచు అంగు ళీయ్యకము యిచ్చును.

2-వ రంగము. (సముద్రతీరము) జాంబవంతుడు వానరుల సామర్థ్యము నిరూపించుచు ఆంజనేయుల జన్మవృత్తాంతంబు దెలిపి ఆంజనేయుడొకడు సముద్రము దాటగలడని నిర్ధరించుట. ఆంజనేయులు సముద్రము లంఘించును.

3-వ రంగము. ఆంజనేయులకు లంఖిణికి జరిగిన సంవాదము.

ఆంజనేయులు అశోకవనము చేరుట. చెట్టుకొమ్మమీద కూర్చొనును. సీత దుస్స్వప్నము. త్రిజటను తనస్వప్నవార్త సీతకు తెలిపి సీతకుశుభమగు నని తెలుపును. రావణుని ప్రవేశము. సీతారావణుల సంవాదము. రావ ణుడు కోపగించుకొని వెళ్లిపోవుట. ఆంజనేయులు సీతనుదర్శించి ఆమె ను, తనసాహసమునుండి ఆపదలచే శ్రీరాముల శుభవార్తదెలిపి ఆంగుళీ య్యకమునిచ్చును. ఆంజనేయులు సీత యనుమతిపొంది ఫలములకై వన నాశనము చేయుచుండును. రాక్షసులను చంపును. రాక్షసులు రావణుని యొద్దకు పోవుదురు.

4-వ రంగము. అక్షయకుమారునికి ఆంజనేయులకును జరిగినయుద్ధము. అక్షయకుమారుడు వోడుట.

5-వ రంగము, ఇంద్రజిత్తు ఆంజనేయులతో యుద్ధమాడి ఆంజనేయులను బ్రహ్మపాశబద్ధునిచేసి రావణునివొద్దకు తీసుకొనిపోవుట.

## చతుర్థాంకము - ప్రథమరంగము

రావణుని ఆస్థానము. రావణ ఆంజనేయులకు జరిగిన సంవాదము. రావణుడు ఆంజనేయుని చంపబూన విభీషణుడు అడ్డపడి హితముపదేశింప ఆంజనేయుల తోకకు బట్టలుచుట్టి అగ్ని రగిలించి వదలుమని రావణుడు తన భటులకు యాగ్నాపించును.

2-వ రంగము. ఆంజనేయుడు శీతారామ స్మరణచేయుచు లంకను కాల్చును.

3-వ రంగము. ఆంజనేయులు మరల సముద్రములంఘించి వానరులనుచేరి యిచ్చటి సమాచారము తెలుపుచు రాములనుచేరి సీతయిచ్చిన అంగుళీయ్యకమును శ్రీరాములకు అర్పించుట. రాములు అంగుళీయ్యకమునుచూచి వుంగరమునువర్ణించుచు లంకపై దండెత్తను ప్రయత్నించుట.

# నాంది.

## సూత్రధారుఁడు

ఉ॥ శ్రీవరదివ్యపాదసరసీ రుహయుగ్మము హృత్పదంబునన్
వావిరిగానునిల్పి యెడఁబాయక పూజలు సేయుచుండు, నే
దేవుఁడు ధీవరుం డురు సుధీవరుఁ డెత్తఱి భక్తియుక్తి, నా
పావని, సేవకాళిఁ గృపఁ బాలనఁ జేయుత మెల్లకాలమున్.

## అనుబంధము 1

సీ. ధాత్రిజిత కవిసార్వభౌముఁడై నాటక
కవి చక్రవర్తియై క్రాలు నెవఁడు
ప్రపంచ నాటక ప్రభవోర్జితాదులఁ
బ్రకటించి బోధించు ప్రాజ్ఞుఁ డెవఁడు
చరితాంశ నాటక సారపూరితములౌ
రూపకంబు లొనర్చె రూఢి నెవఁడు
స్వల్పకాలమునం దనల్ప నాటక కావ్య
రచనల కోటిచె రహి నెవండు,

గీ. అభినయ జ్ఞాన సంపూర్ణతాధికారి
యై వెలంగెడు రసిక శిఖావతంసు
డెవఁడు బళ్ళారిపురములో నెలమిఁ గాంచు
వాసిఁ గని నట్టి కే. శ్రీనివాసుఁ డతఁడె.

శ్రీ

# లంకాదహనము.

## ప్రథమాంకము - ప్రథమరంగము

( రావణుఁడు - అకంపనుఁడు - శూర్పణఖ. )

అకంప:- ఉ॥ రాక్షసనాశనంబుఁ దనరన్ గని ప్రాణముతోడ వచ్చితే!
ఈక్షితినుండఁగాఁ జనదు హీననిశాచర నిన్నుఁ జూడఁ బ్ర
త్యక్షశనైశ్చరుండవు; నిశాటులమానవుఁ డోర్చు నేయనిన్?
దక్షులు దండకాటవిని దానవులెల్లరు దోర్బలంబునన్.

రావణ:—(అకంపనునిఁ జూచి) అకంపనా! నీవు ఖరదూషణ త్రిశిరుల మరణముఁ జూచి యొకమానవునకు భీతిలి నా సరసకుఁ బఱుగిడి వచ్చితివియా? ఇట్టిపిఱికి యలవాటు నీకెపుడు ప్రాప్తిల్లెను? ఖరాసురుని జయించునంతటి మానవుఁడీ మహిలోఁ గలఁడా? మూఁడు జగములును బంతివలెఁ బట్టి గిరగిర దిరుగం జేయు సాహసపరాక్రమ ధీరుని నొకవసికిమాలిన మానవపశువు చంపెననిన, నెవరు నమ్ముదురు? నీబుద్ధిచెడి యున్మాదవస్థలో నున్నవాఁడవని నేనెఱిఁగెదను. ఇఁకనట్టిమాటలాడకు. వెడలిపొమ్ము.

(శూర్పణఖ ప్రవేశము.)

చం॥ త్రిదశులఁ బట్టి వెట్టిసనిఁ దీర్పఁగ నుంచిన నీదుదర్పమున్
మదిఁ దలపోసి గర్వమున మానముఁ గోల్పడియక్కటా; భువిన్
బ్రదుకఁగ నేల నేనిఁకను? భ్రాతృవరా ధరభారమాయె నే!
వదలెదఁ బ్రాణమే నపుడు వాసిగ నందఱు సంతసింపుడీ.

శూర్పణఖ:—( ముక్కుమూసుకొని రావణునియెదుట నిలచి) అన్నా రావణా! లోక విద్రావణా! నీతుసంగఁ జెల్లెల జీవితకాలము నేఁటికి ముగిసెను. నిన్నుఁ జూ

చి పిదపఁ జావవలెనని కష్టపడి యెటులనో యిచ్చటికివచ్చితి. అవమానాగ్నిలోఁబడి కాలుచున్నదానను.

రావణ:—చెల్లెలా! శూర్పణఖా! భయపడకుము. ధైర్యముఁదెచ్చుకొని నీ యవమాన వార్తఁ దెలుపుము. నీ కెవరినుండి యీ పరిభవము ఘటిల్లించెను? దాఁపక సకలముఁ దెలుపుము.

శూర్పణఖ:—అన్నా రావణా! నీవు త్రిజగంబులు పాలించువాఁడవై, చారులవలన నా యవమానవార్తఁ దెలిసియుందువని నమ్మియుంటిని. నీవుమత్తిల్లి రౌదురులేక యథేచ్ఛముగ మన్మథభోగములంబడి యున్నావు. కావుననే లోకవార్తలు నీవు తెలియవు. నీవెల్లపుడు గ్రామ్యభోగములందే కాలంబుఁ గడుపుటచే నిన్ను జనులు వల్లకాటిలోని నిప్పువలెఁ జూతురు. స్త్రీ పరతంత్రుఁడవై యుండినరాజు, సముద్రమునందు మునిఁగిన పర్వతమువలె ప్రకాశింపఁడు. అన్నా! నీయాజ్ఞ ననుసరించి ఖరాదులంగూడి యరణ్యసంచారంబు గావించునపుడు, రామలక్ష్మణులనెడి యిరువురు రాజకుమారులు నన్నుఁబట్టి ముక్కుఁజెవులుగోసి విరూపిణినిఁగావించిరి. ఖరదూషణత్రిశిరులఁజంపిరి. మిగతరాక్షసుల రూపుమాపిరి. వారిబారికి నోర్వక నేనీ సరసకుఁ బఱుఁగిడివచ్చితి.

రావణ:—హా. హా. రాముఁడనువాఁడు రాక్షసులనుఁజంపెనా? చిత్రము. చెల్లెలా! ఆ రాముఁడెవఁడు? వానికార్యమెట్టిది? వానిరూపమెట్లుండును? వానిపరాక్రమమేపాటిది? దుర్గమమైన దండకారణ్యము వాఁడేలజొచ్చెను? వాఁడే యాయుధమునుఁబట్టి రాక్షసులనుజంపెను? వివరముగాఁ దెలుపుము. ఏదియు నానుండి దాఁపకుము.

శూర్ప:—అన్నా! ఆక్రూరుఁడు రాముఁడు దశరథునికుమారుఁడు. నారచీరలును, కృష్ణాంజినమును గట్టుకొని యుండును. వానిరూపము మన్మథునిరూపము. కోదండమే వానిధనుస్సు. ఆ ధనుస్సునుండి బాణములు పడగండ్లవలె, వెడలుచుండును. అట్టిబాణములచేఁ బదునాలుగువేల రాక్షసులనుఁ జంపుటయేగాక ఖరదూషణులవధించెను. ఋషులకభయమొసంగెను. దండకారణ్యంబు నిష్కంటకంబో

నర్చెను. స్త్రీయనుకారణంబున నన్ను వధించుటమానెను. విరూపిణినిఁ జేసి యవమానించివిడిచెను. అట్టిగుణములు గలవాఁడే వానితమ్ముఁడు లక్ష్మణుఁడు.

### అ ను బం ధ ము 2.

రావణ:—చెల్లెలా! నీవుభయపడకుము. నేను కార్యాలోచనసలిపి వారిని, రూపుమాప యత్నించెద. నీవు నెమ్మదిగనుండుము.

శూర్ప:—అన్నా! నీవు స్త్రీ లోలుఁడవు. కావున నే నెంతటికార్యమైనను నేమఱిలి సరకుసేయవు. మఱియొక ముఖ్యమగు సమాచారము నీకుఁ దెలుప మఱచితిని. ఆరామునకు ధర్మపత్ని యొకతె కలదు. వెడందకన్నులుఁగలది. పున్నమచంద్రునిపలెనుండు మోముఁగలది. సొగసైన నెఱికురులుఁగలిగి సొబగైననాసికయు బెడగైన చూపులును కరికరములఁబోలు తొడలునుగలిగి చక్కందనముచేఁ బొగడ్తకెక్కి దండకారణ్య దేవతయో, రెండవలక్ష్మియో యనఁదగి ప్రకాశించుచున్నది. ఆ లలన మంచియపరంజి చాయగలది. ఆ నాతి పేరు సీత. దానినిఁబోలు దేవతాస్త్రీనిగాని గంధర్విణినిగాని యక్షిణినిఁగాని కిన్నరినిఁగాని నేనుగనియెఱుఁగను. ఆసీత యెవ్వనికినాతియగునో వాఁడు దేవేంద్రునిఁగూడ నతిశయించి బ్రదుకును. ఆ సొగసుఁగత్తెను దెచ్చి నీకు భార్యగానుంపఁ బ్రయత్నించితిని. నా ప్రయత్నము కొనసాగదయ్యె. ఆనాతి నీకుసరిగాదే, నీగతి దుర్గతియని నేఁడలఁచెద. కావున, అన్నా! నీవా రామలక్ష్మణులను జయించి వైరశుద్ధిఁగాంచి సీతతోఁగూడి యసమాన భోగములనుభవింపుము.

రావణు:—చెల్లెలా! శూర్పణఖా? నీవూఱడిల్లుము. ఆసీత నీవువర్ణించుసంతటి చక్కదనముగల స్త్రీయగునేని, దానిని, నే నేవిధముననైనను బట్టితెచ్చి నాభార్యఁగా నుంచుకొనియెద. నీకేశంకయువలదు పోయిరమ్ము.

శూర్ప:—అన్నా! ఆకార్యంబునకు నీవిపుడే వెళ్లుదువని నే నమ్మెద. నేఁబోయివచ్చెద.

(శూర్పణఖ నిష్క్రమణము.)

రావ:-సీ॥ ఆదియేమికతమొ, యామదవతినామంబు
మదనమంత్రంబయి మదినిఁగలఁచు

తరుణినామమువిన్న మరుఁడురువడినన్ను
రేచుచుఁబనిఁబూని రేపుమాపు
వనితపేరునువిన్న వనజాతసాయకుఁ
డేఁచునుద్వృత్తిని నేపుఁజూపి
సీతనామమువిన్న శాతశరంబుల
శంబరుఁడేఁచనిశంబునన్ను

గీ॥ వేదవతియనుతరుణి యావెలదికాదె?
అబ్ధిమందసమునసున్న యతివకాదె?
జనకుమందిరమునసున్న చానకాదె?
చిక్కిదక్కకపోయిన సీతకాదె?

రావణ:--(ఆత్మగతము) ఆహా ఆసీత పేరువినినతోడనే, మరుఁడను క్రూరుఁడు నా మానసముఁజించి చెండాడుచున్నవాఁడు. జనకుఁడు నెఱపిన స్వయంవరదినముననే, యామానినిని బలవంతమున నెత్తికొని రావలెనని యెన్నివిధములఁ బ్రయత్నించినను విశ్వామిత్రుఁడను సన్యాసియొక్క మాయలవల్ల, నాప్రయత్నములెల్ల భంగములయ్యె. ఇప్పుడేమాయెను? రాముఁడతి పరాక్రమశాలి దైవసమానుఁడని యనేకులవలన నేవినినాను. వానితమ్ముఁడు నట్టిపరాక్రమశాలియే. వీరినిఁగెలిచి సీతనుదెచ్చుట కష్టసాధ్యముగనున్నది. కావున నెద్దియోయొక మాయఁబన్ని సీతను లంకఁజేర్చవలెను. (ఆలోచించి) ఈ యాలోచన చక్కఁగనున్నది. నామామ మారీచుఁడు మాయానిపుణుఁడు కావున వానింజేరి కార్యాలోచనము సలిపి కర్తవ్యంబొనర్చెద. ఇప్పుడే నామామయుండు నరణ్యముంజేరెద.

సాహసవృత్తము:—సురేశు నడ్డపడినఁగాని సుధ తినినే విడుతునే?
హాదాజుల్లడ్డపడినఁగాని యతివనిదే వదలనే

సరోరుహాక్షిపతినిఁబాపి సతినివేసఁగా గూడెదనే
స్మరార్తిఁబాయపతినిఁగూడి సరసమతిగ మనెదనే.

{ ఇది 19 వ ఛందంబున 2, 45, 494గవ సూతనవృత్తము
జ, భస, న, స, నగ, గణములు, 11 వ యతి. }

అనుబంధము 3.

(నిష్క్రమము.)

## ద్వితీయరంగము.

### అరణ్యము.

( మారీచుఁడు - రావణుఁడు. )

( మారీచుఁడు తపంబొనర్చుచుఁ గూర్చునియుండును. రావణుఁడు )

రావణుఁడు:—మామా! తపంబుఁజాలింపుము. నీకు వందనంబు లర్పించెద.

మారీచుడు:—రాక్షసేశ్వరా! లంకయందెల్ల నందఱికిని క్షేమమేగదా? నీవేల యొంటరిగా నిచ్చటికి వచ్చితివి?

రావణ:—మామా! నేనుమిక్కిలి యార్తుఁడనై తిని. నీవేనాకుఁబెద్దదిక్కు. నాతమ్ములు ఖరదూషణ త్రిశరులును దండకారణ్యముననున్న నాబలగమంతయును నొక్రముక్కడిమానవునిచే వెక్కసంబుగ ఖండింపఁబడిరి? నాచెల్లెలు శూర్పణఖ, విరూపిణియాయెను. జనస్థానమున నిపుడువసించు రాముఁడను క్రూరుడు గంభీరుఁడై యిట్టిపనియొనర్చెను. తండ్రికోపించి తఱుమఁగొట్టఁగా భార్యనుదోడ్కొని యడవికివచ్చిన క్షత్రియపాంసనుఁడా రాముఁడు. తన యాయువు క్షీణించుటచేఁ గాఁబోలు నాసైన్యమును హతముచేసెను. ఆ రాముఁడు దుష్ప్రవర్తకుఁడఁట. క్రూరుఁడఁట. కఠినహృదయుఁడఁట. మూర్ఖుఁడఁట. లుబ్ధుఁడఁట. పైఁగా స్త్రీలోలుఁడఁట. అధర్మవర్తనుఁడఁట. నాచెల్లెలిని ముక్కుఁజెవులుఁగోసి విరూపిణినిగావించిన క్రూరకర్ముఁడు వాఁడు గావున వానిదేవేరియగు సీతను, జనస్థానమునుండి పరాక్రమించి పరిహరింపఁ బ్రయత్నించుచున్నవాఁడను. ఈ విషయమున, నీసాహాయ్యం.

బవశ్యాపేక్షణీయంబు. నీవు మహాబలుఁడవు. మాయాసంపన్నుఁడవు. కావున నీవిషయమునవాఁకుఁ దోఁచ్చుచునది నీకవశ్యకర్తవ్యంబని తెలియుము.

మ॥ వలదన్నా చెడుబుద్ధిం నీకిరయుమహా వంశోన్నతిన్ ఖ్యాతినిన్
గలదే, ఖ్యాతికులంబునం, దిటుకళంకం? చెన్నదేన్వింటివే?
చెలులన్గోరిన వేనవేల్దారకరే శృంగారరక్షోంగనల్
కలదే సౌఖ్యముకానలన్నవియు నస్మాంగీపతిన్ రావణా.

మారీచుః—రావణా! ఎంతటి చెడుబుద్ధి నీమానసమంటి కలంచెను; ఆపదవచ్చినపుడు కీడుమేలు దెంచక, యిచ్చకములాడువాఁడను నేనుగాను. రాముఁడు మహాపరాక్రమశాలి. సకలగుణ సంపూర్ణుఁడు. మహేంద్రునితో సాటియైనవాఁడు. వానిఁ జెనకినచో లోకమున రాక్షసకులమే నాశనమగును. సీత నీ ప్రాణముఁ దుదిముట్టించుటకై, పుట్టినమృత్యుదేవతయగును. ఇట్టితలంపు నీకుఁగలిగెనేని లంకనీతోను సమస్తరాక్షసులతోను, దుదిముట్టుననుటకు సందియంబులేదు. ఎవఁడో దుశ్శీలుఁడు దుష్టవిచారుఁడు రాముని విషయమున నపనిందలుఁగల్పించి నీచెవిఁదూర్చినాడు. రాముఁడు పితృవాక్యపరిపాలనాసక్తుఁడై రాజ్యంబువదలి యరణ్యముఁ జేరినవాఁడు. రాముఁడు ధర్మదేవతగాఁ దలంపుము. సీత తనపాతివ్రత్యపు బలముననే యరణ్యమున రక్షితయై యున్నది. ఆసతిని, బలాత్కరించి హరింపఁగోరుటతగదు. సూర్యునిప్రభ, నెవ్వరేని దొంగిలింపఁ హరింపఁగలరా? రాక్షసాధిపా? ప్రయోజనములేని యీ ప్రయత్నమునుండి ఫలమించుకైనను లేదుగదా? నాయనా? రావణా! రాముఁడప్రమేయుఁడుకావున వానిఁజెనకఁజూడకు. రాక్షసకులము ముంపకు. నా యుత్తమ వాక్యములువినుము.

సీ॥ చలమేలవలదన్న కులముపాడగునన్న
కలుషవర్తనమెన్నికలఁపకన్న
బడబానలముఁబట్టి బ్రతుకనౌ నేయన్న
పరకాంతయనుపహ్నిఁబడకుమన్న

కలకాలమిలుఁగాల్చుకలుషవర్తనమన్న
కులశీలయశములుతలఁగుమన్న
సీతత్రిలోకవిఖ్యాతజగన్మాత
యనినీవుసీతినినరయుమన్న.
గీ॥ రాముఁడన శాత్రవానీక భీముఁడన్న
రాత్రిచరులకు యముఁడు సౌమిత్రియన్న
మేదినీజాతనీ పాలిమృత్యువన్న
వలదువలదన్న యీబుద్ధివదలుమన్న.

రావణు:—మామా! నీమాటలు, నాకురుచింపవు. సమస్తజగములు నాపేరు వినినంత మాత్రమున, గడగడవడకుచుండ నొకమానవునకా నేను భీతిల్లునది? వినసహ్యంపు మాటలునీవు బలుకకు. త్రిమూర్తులొక్కటై, నాపైఁబడినను, వారినినే సరకుసేయను. నీవు నాయాజ్ఞమీఱుట ధర్మంబుగాదు. కావున నాకార్యంబునకు సాహాయ్యపడుము.

మారీచు:—నాయనా! రావణా! నీమాట మీఱవలెనని నాకుఁగుతూహలంబులేదు. ఆ రామునినుండి నేఁబడినపరిభవములు నోటనుడువ, నవమానకరములుగ నున్నవి. మున్ను నేను గజాయుతసత్వుఁడనై ఋషిమాంసమును భక్షింపవలె నని విశ్వామిత్రుని పైఁబడ నాముని, సత్వశాలియగు రాముని బిలిచికొని వచ్చి తనయజ్ఞంబు రక్షింపఁ గావలియుంచెను. వాఁడొక పిల్లవాఁడని సరకుసేయక, నేఁపైఁబడ, నొకబాణముచే శతయోజనముల కావల, సముద్రమునంబడవైచెను. అట్టి సత్వశాలిని, చెనకుట కర్తవ్యముకాదని హితము బోధించితిని. వానితో విరోధముఁబెంచితివేని లంకాపురి నశించుట చూడఁగలము. నినుఁగూడిన దోషమున రాక్షసులమెల్ల నశించును. రాక్షసాధిపా! పరదారగమనముకంటెను, గొప్పపాపము మఱొకటికలుగునా? సహస్ర స్త్రీలు, నినుఁబెండ్లాడినవారున్నారు. వారియందనురక్తుఁడవై యుండుము. ఆ రామునిచే దెబ్బలుతిని యోగాభ్యాసముచేయుచుఁ దపోనిష్ఠుఁడనై యిచటనున్నాడను. వానిపేరవిన నాకు సదాకాలము భయము

మగుచుండును. పాశహస్తుఁడగు యమునిబలె నారాముఁడు నాకు నెల్ల యెడఁ గనఁబడుచుండును. ఒకరాముఁడేల? పెక్కువేలరాములు, నాకట్టెదుటఁ దోచుచుందురు. ఈ యడవియంతయు, నాయెడ, రామమయముగ నున్నది. కలలోఁగూడ రాముని కలవరింతలేయుండును. రాముని పేరొకటియే కాదు. "ర" కారవర్ణమే నాచెవిఁబడినంతనే, నామానసమెల్లఁ గాల్చుచుండును. నన్ను బ్రాణముతోనుండఁ జూడఁగోరెదవేని నీవూనికమానుము. నీకు నేను బంధువుగాన హితముఁ బలికితిని.

ఉ॥ రాముఁడతుల్యవిక్రమపరాక్రముఁ డుగ్రవిరోధివర్గ సు
త్రాముఁడు; మున్ను వానిశరధారల వాడితనమ్ము రీతి, రా
రారాములఁబడ్డనామదికి రాయిడిఅంపముకోఁత యెల్లెడన్
మామహితంబువించునిఁక మానుము, రాముని జోలి, రావణా.

### అనుబంధము 4.

రావణు:—మారీచా! నాచిత్తమునకుఁ రుచింపని యీయనుచితార్థములను చెప్పనగునా? నీహితములు, చౌటినేలయందు నాటిన విత్తనములవలె నిష్ఫలములు సుమా. ఆద్రోహి రాముఁడు చేసినకృత్యమునకు సీతాపహరణమే ప్రతీకారము. సీతను, నపహరింపఁ గంకణముఁ గట్టుకొంటిని. ఈ నిశ్చయమునుండి సురాసురులేరును నన్ను మరల్పఁజాలరు. నీ సహాయ్యముఁ గోరితినిగాని, నే నిశ్చయించిన విషయమునంగలగు గుణదోషములఁగాని యుపాయాపాయములను నుగ్గడింప, నినువేఁడలేదు. నీవు రాజధర్మమును దెలియక కేవలము గర్వజ్ఞానమునంబడి, రాజునగు నన్నుఁజూచి పరుషములాడఁగోరెదవు. ఇఁక నీవు మాఱాడకుము. ఈ మహాకార్యమునందు నాకు సాహాయ్యమవశ్యకముగఁ జేయవలయు. ఈ కార్యము నీవుసేయవేని నీచే బలాత్కారముననైనను జేయింతును. తుదకునినుఁ జంపుదును. నాతో విరోధించితివా మరణమిప్పుడే నిశ్చయము సుమా!

మారీచు:—(ఆలోచించి తలయూఁచి) రావణా! నేనేమిఁ సేయవలయును. బలహీనుఁడను నేనుగావున నేనేమి సేయఁగలను?

రావణు:—మారీచా! నీవొక చిత్ర మృగరూపమును ధరించి సీతయెదుట సంచరింపుము. సీత బంగారుమయమైన నీ శరీరమును జూచి యబ్బురపడి యాశించును వచ్చియున్నను, రామునడుగగలదు. రాముడు నినుబట్టుటకై వచ్చును. నీవు వానిని దూరముగా గొనిపోయి “హా సీతా. హా లక్ష్మణా” యని యరువుము. ఆ యార్తారావము విని నేను సన్యాసివేషంబున సీతం జేరి బలవంతముగా బట్టి లంకకుం దెత్తును.

మారీ:—రావణా! ఈ పాపకార్యంబు నీకు వెలిది నేఁజేయుచున్నావు. ఆ సీత నీకు మృత్యుద్వారమని తెలియుము. బుద్ధిపూర్వకముగ నీపతనము దెచ్చుకొనుచున్నావు. కొరివితోఁ దలగోఁకుకొనుచున్నావు. నే నెన్ని హితములు చెప్పినను రోగికి మందు పోసినరీతి నాహితములు చెడచెవిని బెట్టుచున్నావు. నాయుత్నము మీఱినది. నీయాజ్ఞ ననుసరించుటచే మరణము సందేహము. నీ యాజ్ఞోల్లంఘనముఁ జేసినచో, మరణము నిజము. కావున నీయాజ్ఞ ననుసరించెద.

రావణ:—మామా! అదిగదా కార్యాలోచన పరుడవని. చెప్పు. త్వరలోఁబోవుదము.

గేయము:—ధరమునఁదరుణిని హరియింతునా
దురమున రాముని నడగింతునా
మరునియిడుములఁ గడచెంతునా
నిరతము రతులను సుఖియింతునా.

(నిష్క్రమణము.)

తృతీయ రంగము.

(రామ - లక్ష్మణ-సీత-మాయా మృగము - సన్యాసివేషముననున్న మాయారావణుడు)

సీత:—నాథా! యీ వనవైభవమును జూచితిరియా ఎంతవిధముగ వెలయుచున్నది?

అనుబంధము-౯.

రాముడు:—ప్రేయసీ! లక్ష్మిగలున్నవానికి జరమనగనేమి? అరణ్యమనగనేమి?

నీ వెచటనుండువో యచటనే నాకు సకలసౌభాగ్యంబులున్నవని తలంచెద. నాతీ! యీ రంభలను, లతలు జుట్టుకొని కులుకు వైభవము జూచితివియా?

కం॥ కనవే రంభలఁ బెనఁగొని
ఘనమగు నానందసుఖముఁ గాంచులతలనన్
చెలిప్రియునిం బెనఁగొనుఁచున్
గనెడుసుఖం బెంతయనుచు గణుతింపనగున్.

సీత:—ప్రాణప్రియా! ఈ దిక్కునఁ జూడుము ఆ సహకారవృక్షములపైఁ గోవెలలు గుంపులుగూడి, తమప్రియులకు నానందంబు సంఘటిల్లఁ జేయుచున్నవి.

కం॥ సహకారాంతరువులెక్కుచు
సహనాతీతంబులైన శబ్దంబులచే
సహకారులఁబిలుచుచు, సుఖ
సహవాసంబులను జేయు శారికలిచటన్.

రాముడు:—ప్రేయసీ! పశుపక్ష్యాది జాతులందు సైతము తమప్రియలంజూచి మోహింపని జాతియొండైనంగలదా?

సీత:-చ॥ కనకమృగంబుఁగాంచుమదె, కన్నులవిందుగ, మెల్లమెల్లఁగన్
జనువునవచ్చుచుండు నదె చయ్యనఁబోయెను జెట్టుచాటుగా
గనుమదె నిక్కిచూచుచుముఁ గాంచుచు డాఁగెనువచ్చి దాఁటుచున్
మనమలరారు దానిఁగన; మానధనా, పడిఁబోయి పట్టుమా.

నాథా! దూరమునఁ జూడుము. ఏద్దియో యొక విచిత్రమృగము నాకగపడుచున్నది. కొమ్ములకొన లింద్రనీలమణి మయములైయున్నవి. మొగమునందు శోభారేఖలు కొన్ని తెల్లఁగను, గొన్ని నల్లఁగనున్నవి. ముఖపుటము కెందామర వన్నెఁగలిగియున్నది. నల్లకలువరంగు గులుకుచుండును. చెవులు కలువలవలె నాపుటీరి యింద్రనీలములవలె నిగనిగలాడుచుండును. దానికడుపు, మొల్లల వలెను చందురునిచాయవలెను గరాలతీరుగ దెల్లఁగనుండును. పార్శ్వమొకటి

ఱువ్వపూవువన్నెఁ గలిగియున్నది. గిట్టలు వైడూర్యమణులు పోలినవి. పిక్కలు సన్నగనున్నవి. సంధిబంధములు దృఢముగనున్నవి. తోఁక యింద్రధనుస్సు బలెఁ బలురంగులచే రంగారుచున్నది. నామనంబునకింపై కన్నులకుసొంపై నానావర్ణములచే బెంపై సంచరించుచున్నది. ప్రాణనాథా! ఈ యడవిని నినుఁ దప్ప నా యాటపాటలకును, నేను ప్రొద్దుపుచ్చుకొనుటకును, మఱియొద్ది యును లేదు. దీనింబట్టియిమ్ము. నినుఁదలఁచికొనుచు పర్ణంబున ప్రొద్దుగడుపుచుండెద.

లక్ష్మ:--కం॥ మాయామృగంబు బంగరు
ఛాయలుఁగన బ్రహ్మసృష్టి శక్తికిమించెన్
మాయల మారీచుండీ
మాయంబూనియలఁబూనె మమువంచింపన్.

అన్నా! నావదినె సీతయెదుటఁ గనబడు మృగము మాయామృగము గాని నిజముగమృగము కాదు. మారీచుఁడీ మాయనుబన్నినాఁడని నాకుఁదోఁచెడు. పరమేష్ఠి నైసర్గిక సృష్టికిమీఱినదీ మాయామృగసృష్టి.

సీత:—(రామునింజూచి) ఆర్యపుత్రా! ఈ మృగము మిక్కిలి సుందరముగనున్నది. నామనస్సు దీనియందుఁ దగిలినది. ఈ మృగము ప్రాణముతో నీకుఁ బట్టుబడునేని నా సంతసంబునకు మేరలేదు. నీపట్టునకుఁ జిక్కదేని, చచ్చిన దీనిచర్మము నాకునింపుఁగూర్చును. నాకుసంతసముఁగూర్చ నీకుఁగుతూహలముండెనేని నాకు దానింబట్టియిమ్ము.

అనుబంధము 6.

రాము:—(లక్ష్మణునింజూచి) లక్ష్మణా! నీ వదినకుఁ, నీమృగముపై నెంతయాశ కలిగినదో చూడుము. దానింబట్టియిచ్చుట కర్తవ్యమని లక్షణము. నీవనినరీతి, నది మారీచుని మాయయేయగునేని, దానినియవశ్యము చంపవలసినదియేగదా? అగస్త్యునిచేత వాతాపిహతుఁడైనరీతి వీఁడు నాచేతహతుఁడగును. నీవిచ్చట శరసన్నద్ధుఁడవై జాగ్రత్తతో సీతను రక్షించుచుండుము. లక్ష్మణా! యీ మృగముతో

న్నటికిని ఫలింపదు. ఇదిగో నీయెదుటనే ప్రాణంబులు విడచెదను.

లక్ష్మి: సీ॥ చిలువలై చిలుకలై చెవులఁ జేటొనరించు
పలుకులాడఁగ నేమిఫలమె, పతినె!
అన్నకన్నులదైవ మెన్న లేదని యెంచి
వింతగ రాముసే వింతు పతినె!
తల్లికంటెను హెచ్చు తనయన్న సతియని
మదిలోన భావించి మనుదుపదినె!
పరదైవమిలను సోదరుని దారయటంచు
భావమందునఁ గొల్తు భక్తినదినె!

సీ॥ నన్ను నీవిటు దూషింపఁ జన్నె పతినె,
కాలవిపరీతమైతోఁచెఁ గాదెపదినె,
వినెడినీయాజ్ఞ నిప్పుడే చనెదపదినె,
రోషముడుగుము నేను నిర్దోషి పతినె.

మాతా! నీవు నాకు దేవతవు. నాయెడ నిట్టియనుచిత భావమేల్లను. నీమాటలంచిద్దు నా వీనుల గాల్చుచున్నది. ఈ నామానస నైర్మల్యమునకు నీవనచర దేవతలందఱు సాక్ష్యముగ నిలుతురుగాక. రాముఁడున్నచోటికి నేఁబోయెద. ఈ వనదేవతలు నిన్ను గాపాడుదురుగాక. దిక్పతులు నిన్ను రక్షింతురుగాక. సూర్యచంద్రాదులు నినుబోషింతురుగాక.

(అనుచు నిష్క్రమించుచు)

సీ॥ జనకజా నినుగన్న జనని సాక్షిగ నిల్చు
నాచిత్తశుద్ధికి నమ్మవమ్మ
సర్వజనాధార జలధి సాక్షిగ నిల్చు



నాచిత్తశుద్ధికి నమ్మవమ్మ

హవ్యవాహనుడగు నగ్నిసాక్షిగనిల్చు
నాచిత్తశుద్ధికి నమ్మవమ్మ
అతిహితముగ మరుత్తతి యు సాక్షిగనిల్చు
నాచిత్తశుద్ధికి నమ్మవమ్మ
దిసలెల్లగప్పునాకసమె సాక్షిగనిల్చు
నాచిత్తశుద్ధికి నమ్మవమ్మ

సీ॥ హరులు, కరులును, నిర్జరవరులు, నరులు
ఋషులు, ఖేచర భూచర వరులు తరులు
సిద్ధసాధ్యులు నాచిత్తశుద్ధిఁదెలసి
సాక్షులుగనిల్తురమ్మ నిజమ్ముగాను.

సీత:—(స్వగతము)

ఉ॥ బంగరులేడి యేలగనవచ్చెనో! రాముని నేలబంపితో!
యుంగముఝల్లనంగ విభునార్తరవంబిటు లేలవచ్చెనో:
మంగళమూర్తి నారయన మానితవాక్యములాడి యేలపో
వంగనితో మఱందిని? నవారితదుఃఖముహత్తెచిత్తమున్.

ఆహా నాప్రాణనాథునికి నెట్టియాపద మూడెనో? ఆ రాముని సుగుణాభిరాముని దక్కఁదక్కనవాసిని క్రేలుతోనయినఁ జూపఁగలనా? నాప్రాణనాథుని బ్రదికింప సమస్తదేవులకును వందనంబిడి వేఁడికొనిరెద.

అనుబంధము 8.

( సన్యాసివేషంబునున్న రావణుఁడు ప్రవేశించుట. )

రావ:-శా॥ ఏవ్వారిదాన వీవు జలజేక్షణ? కారణమేమి యొంటిగా
నివ్వనభూమినుంటకు? నీ సుమకోమలగాత్రమేలకో

నొవ్వఁగఁజేయ? నీభువన కోటికినెల్లను సాక్షులిచ్చుచుం
నివ్వటిలంగనుండదగు నీరజనేత్రకు నేలకష్టముల్.

సన్యాసి:—ఓ చిన్నారిచిలుకా! నీవు, కమలములవంటి మొగమును కన్నులను కర చరణములునుగల దానవు. నీవెవ్వతెవు? శుభానన! నీవు భూదేవివా? శ్రీదేవివా? లక్ష్మివా? అప్సరసవా? కీర్తిదేవతవా? మదనుఁడువలచిన రతీదేవివా? ఈ యడవికిరానేల? ఇది కామరూపులగు రాక్షసులు వాసము చేయు స్థానము. నీవెటుల నిచ్చటికివచ్చితివి? నీపేరేమి?

సీత:-సీ॥ మునిజనపూజితా! జనకునికూతుర
సీతనామమున నేఁజెలఁగుదాన
దశరథసుతునకు దారనై వెలయుదు
పితృవాక్యమతిశయ మతినిబూని
నాభర్తరాముండు నామఱందియు నేను
వనవాసమును సల్పువారమయ్య
స్వర్ణాభవర్ణ సంపూర్ణమై యొకజింక
కనుపింపగా నాకుఁ గానఁబడియె
గీ॥ దానిఁబట్టను నాభర్త పూనిచనియె
భ్రాతృరక్షణమునకు సౌమిత్రిపోయె
వారువచ్చెడుతఱియయ్యె వచ్చిభక్తి
నతిథిపూజలు సల్పుదునయ్య మీకు.

(సన్యాసికిఁ బీటతెచ్చివైచి పాద్యమొసఁగి) బ్రాహ్మణోత్తమా! పక్వాన్నము సిద్ధముగనున్నది. భుజింపుఁడు. నేను, రాక్షస నాశకుఁడగు రామునిభార్యను. జానకిని. నాపతివెంటవచ్చి యీ యరణ్యంబుజేరినాను. నాపతి యొక సువర్ణమృగమును వెన్నంటి దానింబట్టితెచ్చుటకై పోయినవాఁడు. అన్నసాహాయ్యమునకై నామఱఁది లక్ష్మణుఁడు పోయినాఁడు. శ్రమదీర్చుకొనుఁడు. బ్రా

కోటలు వెలికిఁ గోరుచున్నావు. సూదితోఁ గన్నుఁ బొడిచి కొనుచున్నావు. నాలుకతోఁ గత్తిని నాకుచున్నావు. నీ నాశనము నీకుఁ దెలియదు. కుత్తుకకు రాయిఁగట్టుకొని సముద్రము దాటఁగోరుచున్నావు. సూర్యచంద్రులఁ జేతఁ బట్టనుంకించుచున్నావు. మండుచున్న నిప్పును గుడ్డలో గట్టికొనుట సాధ్యమా? ననుఁ గొండ నీకు సాధ్యమా? ఉక్కు మొనలు గల శూలమును కేలనడప సులభమా? సింహమునకును నక్కకును నెంత భేదమో, చెలమకును సముద్రమునకు నెంత వాసియో, మేలైన మద్యమునకును గడగనీళ్లకును నెంత యంతరమో, బంగారమునకు సీసమునకు నెంత భేదమో, చందనపు ముద్దకును బురదకును, నెంత యంతరమో, రేనుఁగునకును పిల్లికిని నెంత వాసియో కాకమునకు, గరుత్మంతునకు నెంత దూరమో, గద్దకును హంసకు నెంత భేదమో, నీకును రామునకు నంత భేదము. బియ్యపు గింజయని యీఁగ వజ్రమును మ్రింగిన జీర్ణమగునా? మరణమే సిద్ధమగును. ఓరీ రావణా? యిది దృఢముగ నమ్ముము.

సీ॥ రాముఁడు సింహంబు రావణా నీవొక
బడలిన నక్కవు కడిమిరేల?
ఆఁకలిగొనిన పంచాస్యము నోటిలోఁ
జిక్కినామిష మెటు దక్కు నీకు?
ఫూత్కారమొనరించు భుజగేంద్రు దంష్ట్రిలు
పెరుక సాధ్యమె నీకుఁ బిఱికిపంద?
శిరముపైఁ గొండను ధరియించి సంద్రము
నీఁదఁ జూచెదు బిచ్చివీవు కావె?

గీ॥ చిచ్చునొడిఁగట్టి కొనుకరణి చిచ్చుఁగత్తి
నోట నిడుకొను గతి నీకుఁ జేటువచ్చు

నమ్మకు మా రావణా యిది నమ్మగాదు
నేను దైవస్వామంటకు హీనవనుజ.

రావణ:— ఓ పరవర్ణినీ! నేను సామాన్యుఁడనుగాను. మహాపరాక్రమశాలిని మృత్యువును జూచి పాఱుప్రజలవలె నన్నుఁజూచి దేవగంధర్వోరగ పిశాచములు పాఱుచుందురు. సూర్యచంద్రాదులు నాయింటఁ బనులు సేయుచుందురు. నా పట్టణముఁజేరి నాతో వసించువేవి మానవులు నెంత మాత్రము స్మరింపకుందురు. ఇట్టినన్ను నీవై ప్రార్థింపవలసియుండ నేనే మన్మథశరపీడితుఁడనై నిన్ను వేఁడుకొనుచున్నాడను. కేవలమొక మనుష్యమాత్రుఁడౌ రాముఁడు యుద్ధమున నాయొక్క వ్రేలికి సాటిరాఁడు. నీ భాగ్యమున నేను నీకుఁ బ్రాప్తించితిని

సీత:— దుష్టాత్మా! నేను మహా పతివ్రతను. సర్వభూతములును బ్రొక్కునట్టి దైవము నా పతి. ఇట్టి పాపమునకు నొడిగట్టకు.

రావణ:— (కోపమున) సీతా! నీవు పిచ్చిదానవు. ఇదిగో నా రెండు చేతులతో నీ భూమినంతయు నెత్తుదును సముద్రమంతయుఁ ద్రాగుదును. మృత్యువు నెదిరింతును. సూర్యునడ్డగింతును. నీకుండగిన పెనిమిటిని నేనేను? సుందరాంగీ! ముల్లోకములందును మిక్కిలి ప్రసిద్ధిఁగాంచిన పెనిమిటి రావణుడని కోరుదువేని నన్నుఁ జేపట్టుము. [అనుచు సీత వెంట్రుకలను దొడను పట్టి యెత్తుకొనిపోవును.]

సీత:— [హా రామా యని యఱచుచు మూర్ఛబోవును.]

తురీయ రంగము.

రామ - లక్ష్మణ.

(రాముఁడు వచ్చును)

రాముఁడు:- (స్వగతము) ఇదియేమి? ఇన్ని దుశ్శకునములకు గారణమేమియగుచుండును? నా వెనుక భయంకరధ్వనితో నక్కలఱవ నేల? సీత రాక్షసులచే మ్రింగఁబడక క్షేమముగ నుండునుగదా? ఆ మాయా మారీచుఁడు నా చేఁజచ్చుచుఁ దగునట్లు నా కంఠధ్వని ననుసరించి "హా సీతా హా లక్ష్మణా" అని యఱచెనే? ఏలయాలించి యుండును ?

( లక్ష్మణుని ప్రవేశము )

అనుబంధము 9.

[ రాముఁడు లక్ష్మణునిఁ జూచి ]

లక్ష్మణా! సీతను విడిచివచ్చితివేల? ఆ సీత యిప్పుడెక్కడనున్నది. నీవు కాఁపున్న వాఁడవు, హానియేమియు నుండదని నమ్మివిడిచి వచ్చితిని. నీవు సీతను వదలి యిచ్చటికి వచ్చుటచే నామనమెల్లభీతినందెనా. నా యెడమ కన్నును నెడమ భుజమును నదురుచున్నవి. కారణమేమో?

లక్ష్మణః:— అన్నా! నేనై సీతను నచ్చట విడిచి యిచటికి వచ్చిన వాఁడను కాను. నా వదినె నన్ను గూ్రరములైన మాటలాడి పొమ్మని తొందర పెట్టఁగ నీ యొద్దకు వచ్చితిని గాని వేఱుగాదు. “హా సీతా హాలక్ష్మణా” రక్షింపుమను పలుకులు సీతవిని నేనెంత పలికినను నీ యందలి నెయ్యముచేత నీకేమో విపత్తుకలిగెనని భీతిలి రోదనము చేయుచు పొమ్ము పొమ్మని నన్ను బలవంత పెట్టెను. రాముని జంపవలెనని యత్నించినాడనని నన్ను నిందించెను. ఇంకి యింకెన్ని అనరానిమాటలాడెను. కావున వెడలి నిన్ను దుర్కొనవచ్చితిని.

రాముడు:- సీ. వేదండషండోరు విపినస్థలంబిద్ది
సరసనసరోరుహా చరణసీత
కంఠీరవోపేత కఠినకాననమిద్ది
మదగజోపమయాన సుదతిసీత
క్రూరశార్దూలసంచారకాననమిద్ది
భీతకురంగాక్షినాతి సీత
విహగేంద్రవిలసిత గహనోగ్రవనమిద్ది
కాలాహివేణియా కాంతసీత,

గీ. అట్టివనితను వనతల మందువదలి
వచ్చితివెనీవులక్ష్మణా యిచ్చగించి

ఏమియిడుమలమూఁడెనో యింతికిపుడు
యేమియనఁదగునీమతి కెటులఁబోయె?

లక్ష్మణా! సీతను వదలుట మిక్కిలి యకృత్యము. స్త్రీలు వివేకము లేని వారు. అందునఁ జింత చేఁ గూడి పరుషములాడిన మాత్రమున నీవునొచ్చి కొన దగునా? ఎంతమాత్రము యుక్తముగాదు. కానిమ్ము పోవుదము.

(ఆ శ్ర మ ము జే రి.)

లక్ష్మణా! భయశీలురాలగు సీతయిచ్చట ఆశ్రమమునలేదుగదా! వేడుక కొఱకుచట నేని దాఁచియుండునా? ఏవనమునకైనను పోయియుండునా? పోయి వెతకుదము రమ్ము.

(నిష్క్రమణము)

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

### అరణ్యము - రామలక్ష్మణులు.

### అ ను బ ం ధ ము 10.

రాముఁడు:- (స్వగతము) సీతా! ప్రియసీ నీవెందుదాఁగితివి. యీ నవ్వులాటలిఁకఁ జాలును. నేను మిక్కిలి దుఃఖితుఁడై యున్నవాఁడను. నా యొద్దకురమ్ము సౌమ్యురాలా! ఇదిగో జూడుము. నీచే పెంపబడిన జింకపిల్ల లిప్పుడు జంట మాలి కన్నులనీళ్లు గార్చుచున్నవి. నిన్ను వదలి బ్రదుకఁజాలనుగదా! కప టాచారునిఁ గీర్తి విడుచువట్లు నన్ను విడిచినీవెందేగితివి? నినుఁగానక నేను బురదలోఁ బడిన రేనుఁగువలె దుఃఖంబున మునుఁగుచున్న వాఁడను.

లక్ష్మణా:- అన్నా! నీవుశూరుఁడవు. దుఃఖింపకుము. నేను సీతాదేవిని వెదుకఁ బ్రయత్నించెదను. పొదరిండ్లలో దాఁగినదిరో గుహాలలో నడఁగియున్నదిరో. నేఁజూచెద. నా వదినె వనములో సంచరించుచుండును. పుష్పించిన తామరకొలంకుల విహరించుచుండును. లేదా, మునల, భయపెట్టఁగోరిరో, మన సామర్థ్యము నెఱుంగదలఁచిరో యిందెంకైన దాఁగియుండును.

రాముడు:- ప్రియురాలా! నీవు పుష్పములయందు మిక్కిలి ప్రీతిగలదానవు కావునని జాలుగోయుచు విహరించెదవా? ఇటురమ్ము రంభోరూ! నీ తొడలరంటి బోదియలసాటిగా నుండును గాన వానిపై వైరమున నందేల నిలిచితివి? నన్నేగతాళి సేయుటవలన నీకేమిప్రయోజనము? ప్రియా! పరిహాసము విశేషించి యాశ్రమ వాసులకు ననుచితము. నీవులేని యీపర్ణశాల పాడు పడియున్నది [లక్ష్మణుం జూచి] లక్ష్మణా! రాక్షసులు సీతనుం బట్టిభక్షించియుందురా? కాదేని మృగముల కడుపులు కన్నీళ్లుగార్చుచు స్తంభించిన దానవలె నిలిచెనేల? అయ్యో సీతా! యెక్కడికిం బోయితివి? లోకులు నన్నేక వీర్య హీనుడనియు, దయాశూన్యుడనియుం బలుకుదురుగదా? ఆహా! సీతలేనిది నేనయోధ్య నెటుచేరుదును? లక్ష్మణా? సీతాపహరణమును నాప్రాణాపహరణమును సవిస్తరముగ నాతల్లి కౌసల్యకుం దెలుపుము. ఆమెనూరడింపుము. నాయంతటి పాపి భూలోకమున నెవ్వడును లేడు దుఃఖము వెంట దుఃఖము సముద్రములో నలలంబలె నాగుండెకుదది ఛేదించుచున్నది. లక్ష్మణా? రాజ్యము పోయినందులకు నే చింతింపను. బంధువులం బాసినందులకు నేను దుఃఖింపను. తల్లిని వదలివచ్చినందుకు, నే వ్యసనపడను. సీతావియోగంబు నన్ను దుఃఖరాసిని ముంచెను.

చం॥ జనకజలేనితానము స్మశానము లేదనుమాన మేమియున్
వనజదళాక్షిలేనివనవాసము, నావ్యసనాధివాసమే
ఘననిభవేణి,లేనిచెలికారము నాకిలనంధకారమే
మననికమానినిన్వదలి, మానవిహీనునిభంగి, లక్ష్మణా.

లక్ష్మణ:- రామా! శోకము విడువుము. ధైర్యముబూనుము. సీతను వెదకుటకై యుత్సాహముంగైకొనుము. ఉత్సాహము గలవారు దుష్కృతములైన కార్యములు నెఱవేర్తురుగదా? మున్ను దేవాసురులుచేరి సముద్రమథనంబొనర్చి యమృతముసంపాదింపరా? పురుషసింహా! నీవు దుఃఖితుండవైతివేని ప్రపంచంబంతయుం దేజోభంగబడి పీడింపం బడదా? కృత్యాకృత్య వివేకము చెడకుండ నీయట్టిధీరులెట్టి యిలందేని దుఃఖింపరుగదా? నీవు బృహస్పతి సమాన

బుద్ధిగలవాఁడవు. వ్యసనమోహములు నిన్నావరించినందున, నీ పెద్దరికముఁ దెలియక దుఃఖించుచున్న వాఁడవు. సర్వలోకములను రూపుమాపఁజాలిన నీ పరాక్రమములను నీవే తెలిసికొనుము. నీవుతలఁచిన సమస్త ప్రపంచంబు, నాశనమగుఁగదా? సీతాపహారకుఁడగు పాపాత్ముండెవ్వఁడో వానిఁ దెలియుట కర్తవ్యంబు. అన్నా! మనము జటాయువున కగ్ని సంస్కారంబు సేసినపిద పంగబరధుఁడను యక్షుఁడు శాపవశత రాక్షసుఁడైబడి నీచే మోక్షమంది సుగ్రీవుఁడను వానరశ్రేష్ఠుని సరసకు మార్గముఁజూపి యంతర్హితుఁడయ్యెను గదా? ఆవానర శ్రేష్ఠుని మనమును చూడవలయును. దుఃఖించిన ప్రయోజనంబు లేదు. ధైర్యము పూనుము. రమ్ము (అనుచు ప్రక్కకు వెళ్లుదురు.)

(ఆంజనేయ సుగ్రీవులు ప్రవేశించి)

## అనుబంధము 11.

ఆంజనేయుడు:- (సుగ్రీవునిఁజూచి) సుగ్రీవా! దూరంబున నెవరో యిరువురు యతివేషములధరించి మాటలాడుచున్నవారు, చూచితివియా?

సుగ్రీవ:- అంజనా సుతా! మా ద్వేషియగు వాలి మాయనికి పట్టఁదెలియుటకై మారువేషములు ధరింపఁజేసి వీరినిఁబంపియుండునా? నాకేమో దిగులగుచున్నది.

ఆంజనే:- సుగ్రీవా! వాలి నిమిత్తము నీవిటు తత్తరపాటు పడవలదు. ఇది ఋష్యమూకము. వాలినుండి మనకేమాత్రము భయములేదు. వీరిమోమునందు క్రూరభావ మించుకైనను లేదు. నీ బుద్ధియు జ్ఞానము మాసిపోయినది.

సుగ్రీవ:- అంజనేయా! నిజము నిజము. అజానుబాహులును, విశాలమగు నేత్రములును గలిగి విల్లులమ్ములును ఖడ్గములును దాల్చి, దేవకుమారులవలె, వీరు వెలుఁగుచున్నవారు. వానరోత్తమా! నా హితమును గోరినీవు వారల యొద్దకుఁబోయి వారి వ్యాపారములను పరికీంచి, భాషణచే దెలియుము, నీవు సర్వజ్ఞుఁడవు కావున వారిమాటలచే నన్నియు గ్రహింతువు. నేను దూరంబున నుండెద. పోయిరమ్ము. (రామలక్ష్మణులు తిరుగుచు నచటికి వత్తురు.)

ఆంజనేయు:- మంచిది. (రామలుసంభాషణంబుచేసి)

కం. ఆదయ మహనీయులుఁగా
మీరగపడుచున్న వారు మీవార్తయు నేఁ
గోరితి విని మీకు నమ
స్కారముల నర్పింతు వాయుసంభవుఁడను నేఁ జ.

( నమస్కరించుచును. )

మహానుభావులారా! మీరు రాజర్షులవలెను దేవతలవలెను నలరుచున్నారు. ఇట్టిమీరు తీక్ష్ణ వ్రతములను బూని తపస్వివేషధారులై దుర్గమమైన యీ ప్రదేశమున కెట్లు వచ్చితిరి? పురుషసింహులగు మీరెవ్వరు? మీరు దేవసమాన పరాక్రమములుగ, నగపడుచున్నారు. భూమికి వచ్చిన చంద్ర సూర్యులవలె ప్రకాశించుచున్నవారు. సమస్తరాజలక్షణ లక్షితులైనవారు. యీజడకిమండలము లేల ధరించితిరి? మీసేవకుని యెడఁగరుణించి మీ వార్త దెలుపుదురని వినయముతో వేడుచున్నవాఁడను. ధర్మాత్ముఁడగు సుగ్రీవుఁడను వానరరాజు తన యన్నయగు వాలిచే వంచితుఁడై మీ వార్త దెలియ నన్ను బంపఁగా నిచ్చటికి వచ్చితిని. నేను హనుమంతుఁడను పేరుగల వానరుఁడను.

రాముఁడు:- (లక్ష్మణుని చూచి) ఈ మహాత్ముఁడైన వానరుఁడు కపిరాజా సుగ్రీవుని సచివుఁడట. ఆ సుగ్రీవుని నేనేఁ జూడవలెనని యుంటిని. వెదుకఁబోయిన తీగ కాలఁదవిలి నటులనతఁడే నాయొద్దకుఁ దనసచివుని బంపినాడు. ఇతనితోనీవు మధురవచనముల మాటలాడుము.

ఆంజ.- సీ॥ మహనీయులార నామములెవ్వి మీకును
గాననంబును జేరుకతమదేమి?
లక్ష్మ:- రామలక్ష్మణ నామరంజితులము మేము
మాయయోధ్యనుబీడి మునితిమదవి
మేమిటులుండఁగ నేమాయ నెవ్వఁడో
కొనిపోయె నావదినెను మహీజ

నాసాధ్వినరయుచు నటవులుదిరుగుచు

ఇప్పుడియిచటికిఁ జేరినాము

ఆంజ.-గీ॥ పీడుపిదెడుకతమేమి విక్రమాఢ్య

లక్ష్మణ.-తండ్రిప్రతిజ్ఞయు సలుపఁగఁదలఁచినాము

ఆంజ.-సంతసంబయ్యెమనమతి శాంతమయ్యె

లక్ష్మణ.-వేగఁబిలిపింపు సుగ్రీవువిమలశీల.

లక్ష్మణ:—(ఆంజనేయులకు చూచి) మహాత్ముని సుగ్రీవుని సుగుణములుమాకుఁ దెలిసి యున్నవి. అతని దర్శింప మాకును నపేక్షయున్నది. కావున ననుకూలమైనచో, నతనిని యిచటికిఁ బిలుచుకొనిరమ్ము.

(ఆంజనేయుఁడు నిష్క్రమించును.)

రాముడు:—లక్ష్మణా! కబంధుడు మనకు హితముపదేశించినరీతిగ సుగ్రీవుఁడు మాకు హితుఁడయ్యెనేని, సర్వకార్యములు, నిరంతరముగ సాధింపఁగలము. మన సరసకు వచ్చిన వానరుఁడు సకల శాస్త్ర సంపన్నుఁడని వాని ముఖభావంబుఁ జూపుచున్నది. సిద్ధింపఁదగిన కార్యసమములకు ముందే శుభసూచనము లగపడునని పెద్దలుచెప్పుట నిజమయ్యెను.

(ఆంజనేయసుగ్రీవుల ప్రవేశము.)

ఉ॥ భావుకదాయకంబులగు పాదములంబడి మ్రొక్కువాఁడ, సు

గ్రీవుఁడనార్యసంపనుఁడఁగీశవరేణ్యుని వాలితమ్ముఁడన్

సేవకకామితార్థములఁ జేసుఁజేయు మహాత్ముఁడీవుగా

భావమునందుఁదోఁచి వెతఁబాపుదువీవని నమ్మివచ్చితిన్.

సుగ్రీ:—(సుగ్రీవుఁడు రామ లక్ష్మణులకు నమస్కరించును.)

ఆంజనే:—(రాములఁజూచి) మహానుభావా! ఇతఁడే నా బలికిన కపిరాజు సుగ్రీవుఁడు. తాము ధర్మమును చక్కఁగఁగాంచినవారు. పరాక్రమవంతులు. సమస్తప్రాణులందును, వాత్సల్యముఁగలవారు. తమరేలుకార్యంబున నఖస్థ

మించుకొనెదను బొడఁజూపదు. సత్యప్రతిజ్ఞులు తమరుకావున దామునత్య సంధులై సుగ్రీవునిసఖ్యమునకు బద్ధులైతిరేని నతఁడు తనవ్యసనవార్తలు తమకుఁ దెలిపి, తమసాహాయ్యంబంది ప్రతిసాహాయ్యంబొనర్ప సిద్ధుఁడుగ నున్నవాఁడు.

రాము:—వానరోత్తమా! నే నెన్నటికిని నాడినమాటకుఁ బ్రతిసేయువాఁడనుగాను. సిద్ధప్రతిజ్ఞుఁడను. ఇదిగో నేను నాప్రాణంబుండువఱకును సుగ్రీవుని మిత్రుఁడుగ నుండెదను. వీనికిఁగలిగిన కష్టమును నివారింప యథాశక్తి న్యాయముగ సహాయుపడియెదను. నావిషయము నీవు నిందింపకుము. నీవ్యసనోదంతం బుఁ దెలుపుము.

సుగ్రీ:—రామా! నాయన్నయగువాలి, నన్నువంచించి, నాభార్య నపహరించి, నన్ను దేశమునుండి వెడలఁగొట్టినాడు. నేనెంతగవేడినను, నందు నన్ను గఠినదండనల శిక్షించుచుండును. ఈ మతంగ పర్వతముఁజేరిన కారణమున వాఁడిచ్చటికి వచ్చుటకు శాపభీతుఁడై యున్నవాఁడు కావున నాయన్నను శిక్షించునటుల నాకభయమొసఁగుము. నాయన్న వాలి బలసంపన్నుఁడు. సత్వశాలి. సప్త సముద్రము లొక్కదినంబున సంచరించు బలముగలవాఁడు. వానినెదిరింప సామాన్యులకు నసాధ్యంబు.

రాము:—సుగ్రీవా! నీవు భయపడకుము. నేనువానిఁ జంపఁజూచెద. నాతండ్రి యాజ్ఞా నువర్తుఁడనై నీ దండకారణ్యంబుఁజేరి యుంటిని నేనులేని సమయమున నెవ్వఁడో నా ప్రేయసిని సీతను నెత్తికొని పోయినాడు. ఎందుదాఁచి నాడో తెలియదు. వాని రూపుమాపు గార్యమునందు నీవు నీబలముఁగూడి, నాకు సాహాయ్యుఁడవైతివేని, నీ భ్రాతృసంహారమున నీకు నేను సాహా య్యుఁడనయ్యెద.

ఉ. వెఱవకుమయ్య, వాలి; యతివీర్యుఁడటంచును, నేనువాని పెం
పఱఁగను సల్పువాఁడను సురాసురులడ్డము వచ్చిరేని; నీ
యఱమరమాని యుండుమిఁక, నాకులపాటును జెందనేల! యా
కటితలమర్కటుల్ గడిసి కర్కశయుద్ధము నాచరింపుమా.

సుగ్రీ:—మహానుభావా! నాకార్య సాఫల్యమయ్యేనేని మీకు నేను దాసానుదాసుండనై వర్తించెద. ఇందు కేసందియంబును లేదు.

రాము:—సుగ్రీవా! అటులైనచో, రేపటిదినంబుననే నీవు నీయన్నతోఁ గలహంబొనర్పుము. నేను దూరమునను౦డి నీయన్నను నా బాణంబునఁ దెగనఱకెద.

సుగ్రీవుఁడు:—మహానుభావా! అటుచేసెద. నిను నమ్మెద.

(నిష్క్రమణము.)

ద్వి తీ య రం గ ము.

( వాలి సుగ్రీవులు రామ లక్ష్మణులు. )

( రామలక్ష్మణులు దాఁగియుందుట. )

వాలి:—ఓరీ ద్రోహీ! నిన్నెప్పుడెప్పుడు పట్టి వధింతునాయని యెదురుచూచుచుంటిని. నేఁ జేరరాని మతంగపర్వతమును నీవు శరణ్యముగఁ జేసికొంటివి గావున, నిన్నిదినములు బ్రదికినావు. మృత్యువు నోటికి జేవిదొరికినట్లు, నీవే, మృత్యువు వెదకికొనివచ్చి నాచేతఁ జిక్కితివి. ఇఁకనీవు బ్రదుకుట దుర్లభము. త్రిమూర్తులు వచ్చి నన్నెదుర్కొనినను నిన్ను నే వదలను.

సుగ్రీవ:—ఓరీ కాపూరుషా! పరదారనుబట్టి వంచించినరీతి నన్నుఁబట్టుట నీకు సులభముగాదు. మాటల పౌరుషముచే, ననుఁగ్రిందిఁగెడపలేవు. జయాపజయము లొకరిసొమ్ములుగావు. ఎల్లకాలము నీకేజయమగునని గర్వింపకు. పున్నమ వెంట నమావాస్యవచ్చునుగదా? ఇపుడు నినుఁజంపి నీ దారపుత్రాదులకు వెసనంబుగల్పించెద. ఇఁక పెద్దమాటలాడకు. నీ యుద్ధమున నీవుగెల్తువో నేగెల్తునో చూతము?

అ ను బం ధ ము 12.

వాలి:—ఓరీ! నీకిప్పుడే యింతటిగర్వము వచ్చెనా? నీ గర్వమార్చెద. యుద్ధమున నిలువుము. (అనుచు మల్లయుద్ధంబు సలుపుదురు. సుగ్రీవుఁడు దెబ్బలుతిని క్రిందఁ బడిలేచును. )

వాలి:- ఓరీ! హీనబలా! చూచితివిరా నాసామర్థ్యంబు? మఱలనిందు నిలచితివేని, యమరాజ్యంబుఁ జేర్చెద. శీఘ్రమునఁగాళ్లకు బుద్ధిచెప్పుము.

సుగ్రీ:- ఓరీ! కాలుఁజాఱి క్రిందఁబడిన మాత్రాన, నీవింతగఁబ్రల్లదములు బల్కఁదగునా? ఈ తూళినిముఁజంపి, గర్వించిన నీకండలీభూమికి బలియిచ్చెద. (అనుచు మరల యుద్ధమునకు నిల్తురు) వాలిసుగ్రీవుని రక్తప్రవాహములు పాఱునట్టుల దిన్నఁగా, సుగ్రీవుఁడా దెబ్బలకుఁదాళఁజాలక పఱుగిడును)

వాలి:- ఓరీ! మదాంధా! పిఱికీ! ఆఁడుదానింబలె పఱుగిడెదవేల? దమ్ము పర్వతములవలె స్థిరంబుగ నిలిచి యుద్ధమొనర్పుము. (స్వగతము.) వీఁడు దుర్మదాంధుఁడై, కను లుగానక, నన్నెదిరించి పోరఁజాలక పఱుగిడెను. నేనింకనుండి ప్రయోజనంబేమి పట్టణంబుఁజేరి నాస్త్రీలంగూడి సుఖములనోల లాడెద.

(నిష్క్రమణము.)

సుగ్రీ:—(రామునిఁజూచి.) రామా నీసత్యసంధిత్వము నాకుంతెలిసెను. పరాక్రమముఁ జూపి వాలినియుద్ధమునకుఁ బిలువుమని నాకుఁజెప్పి నన్నువాలిచేఁ గొట్టించి తివియా? నీవేమి చింతించి యిటుచేసితివి? రామా! నిన్ను నేనడుగుకొనిన సమయమందే, నేను వాలినిఁజూపనని యథార్థము బలికియుండరాదా? అటు లైననే నిప్పటికుండి పోవనుగదా?

సీ॥ రవివంశజుఁడవగు రామునివచనమ్ము
సత్యమంచని వాలిసరసఁజనితి
ఆర్య మహులజుని యుభయమ్మునిజమని
వాలినిఁబిలచితి నాలమునకు
సగరుసంతతివాఁడు సత్యసంధుఁడని
సలిపితి వాలితో సంగరమ్ము
దాసులదైవము దశరథాత్మజుఁడని
వాలితోఁబోరుచు సొలిపడితి

గీ॥ భూరివిశ్వాస ఘాతుకబుద్ధినీకు
నెవరు నేర్పిరో రామ నేనెట్లుఁగనైతి?

నొంటఁజక్కరహ్యడిఁగాల కూటవిషముఁ
గలుగు నీనుండి బాధలుగలిగెనాకు.

రాము:- సుగ్రీవా! శరీరాయాసమున నీవిటుబలుకుచున్నావు. నేను బాణములు వేయనికారణము నీకుఁదెలియదు కాఁబోలు. సుగ్రీవా! అలంకారమునను వేషమునను నొడ్డుపొడుపునను, నడకయందును నీవును వాలియు నొకరిఁబలె నొకరున్నారు. కావున బాణమువేయక మానితిని. కంఠధ్వనిచేఁగాని, కాంతిచేతఁగాని చూపులందుఁగాని, మీయిరువురికిని భేదమెంతయు, గానగపడలేదు. వానరోత్తమా! నాయజ్ఞానమున, నీకేదేని విపత్తు సంభవించునేని నాకది యపకీర్తియగదా? మీయిరువురి రూపములు గుర్తెఱుఁగక బాణప్రయోగమొనర్చి నిన్ను జంపియుంటినేని, మహాపాతకమునకు నేను గుఱియగుచుంటినిగదా? నీవు మరలఁబోయి యుద్ధముసేయుము. సందేహముపలదు. వాలినొక్క బాణంబుననే వధించి భూమిపైఁబడి పొర్లునట్లు గావించెద. వాలితో నీవు ద్వంద్వయుద్ధము సేయునపుడు, నిన్ను నే గుర్తెఱుంగులాగున, నీవేదేని నడియాలముం, ధరింపుము. ( లక్ష్మణునిఁజూచి ) లక్ష్మణా! యీ గజపుష్పియను తీగనుదెచ్చి మహాత్ముండగు సుగ్రీవుని కంఠమునందు వేయుము. [ లక్ష్మణుండటులొనరించును ] సుగ్రీవా! నీవెటులయినను యుద్ధమున నీ పౌరమును, భద్రపఱచికొని యుండుము. భయపడకుము. నేనీతూరి నొక్కబాణంబున వాలిఁజంపెద.

సుగ్రీవుఁడు:—[రాములకు వందనంబిడి కిష్కింధకుఁబోవును.]

[నిష్క్రమము.]

## తృతీయరంగము.

(రామ లక్ష్మణ వాలి సుగ్రీవులు.)

అనుబంధము 13.

వాలి:—[సుగ్రీవునింజూచి] ఓరీ! సిగ్గుమాలిన పిఱికిపందా! నిన్నటిదినంబుననే, పోరున భీరుఁడవై, నిలువలేక, నారింబలె పాఱిపరల నీ దినంబున నేలవచ్చితివి?

నిన్నీ పనికిఁ బురిగొల్పినవారెవరు? నిను జంపిన, వారికిఁగలుగు ప్రయోజనం బేమి? బుద్ధిహీనా? మృత్యువు నెదిరింప నసాధ్యమగురీతి నన్నెదిరింప నీకసాధ్యమా? మందప్రజ్ఞా! ఇచటినుండి వెడలిపొమ్ము చావకు.

సుగ్రీవ:—ఓరీ దుర్గర్వీ! నిన్నటి దినంబున నీదెబ్బ నాశరీరమున వాయస్థలమునఁ దగిలి నందున బయిటఁగిడితినిగాని నీకు వెఱచిగాదు. ఈదినమే, నీ యాయుఃపరిమాణమునకుఁ దుదిదినమని తెలియుము. నీ భార్యాపుత్రాదులను వచ్చినమిత్రులును, గనిన తలిదండ్రులను నమ్మిన దైవమును దలఁచికొనుము. నీచావా కొనడియలో నున్నది.

వాలి:—ఓరీ! నా బలంబెఱుంగని వానిబలె మాటలాడుచున్నావే? మున్ను దుందుభి నీఁజంపిన నా పరాక్రమము నీవు గుర్తెఱుఁగవా? సప్తసముద్రము లొక్క దినంబున సంచరించుట నీ వెఱుఁగవా? త్రిమూర్తులను సరకుఁగొనని రావణుని జంకనిడుకొని సప్త సముద్రములలో, ముంచినవార్త నీవువినవా? ఇట్టివానితోనా నీవు యుద్ధమున నెదుర్కొని నిలుచుట?

సుగ్రీవుడు:—వాలీ! నిన్నుబొగడు బత్రాజులులేనందున నిన్ను నీవే పొగడుకొను చున్నావు. ఈమూరి నిసుంబట్టి భూమింబడవైచి కాంతిపెఱచి రొమ్ముకె తప్పించెద. ఉత్సవానంతరమున నేలంద్రోయఁబడు నింద్రధ్వజముమాడ్కి నిన్నుఁగ్రిందఁగెడపెదను.

[అనుచు వాలి సుగ్రీవులు యుద్ధమొనర్చు సమయమున సాలవృక్షము వెనుక డాఁగియున్న శ్రీరాములు బాణంబున వాలిం గెడుపును.]

[శ్రీరాములు ముందరికి వచ్చును. వాలి శ్రీరాములఁజూచి]

సీ॥ ఇనకులాగ్రణి నీవు వనచరాగ్రణి నన్ను
జంపుటయిది నీకుఁ జెంపటయ్య?
ఎదిరించిపోరుచుఁ గుదురుగానిలువక
మాయగించుట రాజమతమటయ్య?
తప్పుసేయనివాని దండింపఁదగదని
పలుకెడుధర్మము తలఁపుమయ్య?

ఆర్యమకులజుండవై యార్యధర్మమువీడఁ

గలకాలమది కళంకముగదయ్య!

గీ॥ తొలఁగదీపాపమును నిన్నుఁదలఁపుమయ్య

కలుగు వెసనంబు నీకునుఁగాంచుమయ్య

దారపుత్రవియోగంబు ధరనునీకుఁ

గలుగుచుండునుమని నంతకాలమయ్య.

వాలి:—మహాత్మా! నీవు మహారాజ కొమారుఁడవు. మిక్కిలి ప్రసిద్ధికెక్కినవాఁడవు. శాస్త్రవిదుఁడవు. సత్కులంబున బుట్టితివి. బలసంపత్తిగలవాఁడవు. పెక్కు వ్రతముల నాచరించినవాఁడవు. నన్ను నీవు చెనకితివేల? మఱొక్కరితో యుద్ధముసేయుచుండ, నారొమ్మున బాణంబునువేసి కొట్టితివికదే? ఇది క్షత్రియధర్మమా? యోధుల యాచారమా? వేఱుమొగమై యున్నవానినిఁ జంపుటవలన నీకేమి గౌరవముగలిగెను? నీ వినయమంతయు నే వినినాఁడను. కారుణ్యనిధు రాముఁడని ప్రసిద్ధియేమి? పెద్దల యాచారమును దెలిసినవాఁడవే? నీవిటు లాచరింపవచ్చునా? నాదార తార నీ సమాచారముఁ జారులచేవిని పోరుపోవలదని నాకెంతబోధించినను నీవింతటి ద్రోహయుద్ధము చేయవని తలఁచి నా సోదరునితో యుద్ధమొనర్ప వచ్చితిని. నీకే యుపకారంబును జేసినవాఁడను గాను. ఇప్పుడు నీధర్మంబుఁ దెలిసెను. లోకులవంచించుటకై, ధర్మచిహ్నము ధరించిన పాపాచారుఁడవు నీవు. గడ్డికప్పిన కూపమువలెనుండి, ధర్మపురుషుని వేషంబుఁ దాల్చి, నివురుఁగప్పిన నిప్పువలె నున్న పాపాత్ముఁడవు నీవని గుఱుతెఱుంగక పోయితిని. ఆకలములు తినిజీవయాత్ర జరుపుచు, నటవియందు సంచరించుచునుండు వానరమాత్రుని, నీతోమాఱొక్కని యుద్ధముసేయనివానిని, నీకుఁ బెడమొగమై మఱియొకరితో యుద్ధమొనర్చువానిని, నేపాపమెఱుంగని నన్నేలవధించితివి? నేను మృగమును. నీవో మనుష్యుఁడవు. అందున మానవరాజువు. ఇట్టి నీవింతటి యధర్మ మాచరింపనగునా? ఇట్టి నిందితమగు కార్యమును చేసినందులకు, నీవేమి సమాధానముఁ జెప్పగలవు? నేను కోఁతిని. సత్పురుషులకు నాచర్మము పనికిరాదు. నా యెంట్రుకలు నిషిద్ధములు. నా యెముకలు గ్రాహ్యములుగావు. నా మాంసము భక్ష్యముగాదు. పంచనఖములలో

నోరెత్తఁడనైన నన్ను వ్యర్థముగాఁ జంపితివి. నీవు నాతోడ యుద్ధమొనర్చి యుంటివేని నిన్నెప్పుడో యమపట్టణంబుఁ జేర్చుచుంటిని. నీ వదృశ్యుఁడవై నన్ను జంపితివి. సీతవార్త నాకుఁ దెలుసును. రావణుఁడు నీభార్య నపహరించి నందున వానిం జంపుటకై నీవీ యుహీనబలుల వానరుల సహాయంబుఁగోరి యుం తివని యొనర్చితివి. నా సాహాయ్యంబు గోరియుంటివేని నేనిప్పుడే రావణు నిఁజంపి సీతను దెచ్చియిచ్చుచుంటిని. ఇప్పుడేమనికొని యేమిప్రయోజనము! నా కాలము ముగియుచు వచ్చినది.

రాము:—వాలీ! ధర్మార్థకామములును, లౌకికాచారములును, దెలియక యజ్ఞానము వలన నీ విషయమున నేతప్పును లేని నన్నేటు నిందించెదవు? వానర చాపల్యమున వ్యర్థముగా నేల మాటలాడెదవు? ఈ భూమండలమంతయు రాజుని. దుష్టనిగ్రహము, రాజధర్మము. ధర్మహాని నొనర్చువానిని శిక్షించుట రాజుల ధర్మము. నీవు కామాంధుడవై ధర్మమును వీడినవాఁడవు కావున నింద్యుఁడవు. శిక్షార్హుఁడవు. కామవ్యాపారమే, నీకుముఖ్యము. తమ్ముఁడు కొడుకుసమానుఁడు. అట్టి తమ్మునిభార్యను నీ భార్యగఁ జేసికొంటివి. నీవు చపలుఁడవు. సనాతనమైన ధర్మమును దిగవిడిచి, నీ తమ్ముఁడగు సుగ్రీవుని భార్యతో రమించుచున్నావు. ఆ పాపమే నిన్ను వధించెను. సుగ్రీవుఁడు నాకు సఖుఁడైనందున సఖునికార్యమున సాహాయ్యపడితిని. ఇది నాకు ధర్మమేను. నాచేఁజంపబడుటచే నీవు పాపరహితుఁడవైతివి. కానఁ బరితపింపవలదు?

వాలి!—మహాత్మా! నాకిది అవసానకాలము. నీవు పురుషోత్తముఁడనని నాకుం దెలియును. నీవు చెప్పునది వాస్తవము. ధర్మసూక్ష్మము మిక్కిలి గొప్పవిషయము అల్పునకు నగ్రాహ్యము. నన్ను క్షమింపుము. నేనానేక పాపము లొనర్చితిని. నన్ను క్షమించితావుము. నా తార పుత్రాదులను రక్షింపుము. నా, గారాబు కొమరుని నంగదుని లాలింపుము. రామా! వాఁడు నాకొక పుత్రుఁడు సుగ్రీవునియందుఁగల సఖ్యము వానియందును జూపుము. వానిరక్షణ, నీభారము.

రాముఁడు:—వాలీ! నీకిది యవసానకాలంబు గావున మోహమునీడి తత్వజ్ఞానంబుగలిగి ప్రాణంబులు వదలుము. నీ సుతునివిషయము నీకింతమాత్రము సంతాపము వలదు.

( తార ప్రవేశము. )

సీ॥ కామించితే నాథ కలితభూశయనంబు
మోహించితే మృత్యు మోహనాంగి?
తారనీ కూరిమి దారను వదలితే
మఱచితే నీ సుతు మమత నాథా?
అంగదా! నీతండ్రి యనురాగమును వీడి
యవనికేదప్పెరా యకట నేఁడు?
అగ్రజుని జంపి సుగ్రీవ నీదగు
చలము సాధించితే కలుషమునక?
మఱుఁగున డాఁగుచు మర్కటంబును జంప
దాశరథీ రాజ ధర్మమేర?

గీ॥ పతివియోగంబు సతికి దుర్భరము రామ
నీవెటు లెఱుంగుదువు దాని నిజముగామ
కాంతకన్నీరు వ్యర్థము కాదు రామ
బ్రదికి నీదారయందు నీ ఫలము రామ.

తార:—(కన్నీరు నించుచు) నాథా! ప్రాణప్రియా! నీవిటు మృత్యుపాశ బద్ధుఁడవైతివే? వీరాగ్రణీ! వానరచూడామణీ! యుద్ధమున నీ పరాక్రమములతిభయంకరమే. నీవేల నిచట నేలపై బరుండితివి? మేలైన శయ్యపైఁ బఱుండుము. భూనాథా! నాకంటెను నీకు నీ భూదేవియే ప్రేమాస్పదురాలయ్యెనా? నాథా! నినుఁగూడి చేసలుపు వ్యవహారములన్నియును తుదిముట్టించితివియే? దుఃఖమహాసముద్రమున మునిఁగిపోయితిని. నీ మరణముఁ గనులారఁజూచియు నాగుండె దుఃఖాతిశయమున బ్రక్కలు జేయిపోరలుగా బగలకున్నదే? నాథా! నీ తమ్ముని భార్య నపహరించిన దోషము నిన్నింత కష్టపెట్టెను. నీ వెవ్వరికిని వశుండవు కావు. ఇటు నిన్ను నివశుని జేసి సుగ్రీవుని వశమునం దిక్కన్నట్లు గావించి

నని మృత్యువుగాని వేఱొకటిగాదు. (అంగదుని బట్టికొని) ఈ నీ కుమారుఁడు సుకుమారుఁడు. సుఖములకుఁ దగువాఁడుకాని కష్టపడువాఁడుకాఁడు. ఇఁక నీజ్ఞాతియెంత కష్టపెట్టునో? (అంగదునిఁజూచి) కుమారా! నీతండ్రి నిప్పుడే కన్నులారఁజూడుము. ఇఁక నీవతనినిఁ జూడనలవిగాదు. (వాలింజూచి) నాథా! నీ కొడుకును కౌఁగలించుకొని శిరము మూర్కొని యూఱడింపుము. (సుగ్రీవునిఁ జూచి) సుగ్రీవా! నీపగవాఁడు హతుఁడయ్యెను. నీ కోర్కెలఁ దీర్చికొమ్ము. రుమనుబొందుము. రాజ్యము ననుభవింపుము. మనోహరరూపా! యిపుడు నన్నును నంగదునివిడిచి పోయెదవా?

( రా ము నిం జూ చి. )

చం॥ దురితవిచారమేలసతి; దుఃఖము మానుము, జీవమాత్మ నీ
వరయుమబుద్ధి శాశ్వతమె యాయువు ధారణి, దేహధారికిన్
పరమపదంబుఁ గాంచుగతి ప్రాప్తిలె నాథు డకంచునాటకన్
స్థిరమతినందియుండుమిల దీనుని సూనుని మోముఁజూచుచున్.

హను:—తారా! నీవు జ్ఞానివి. ప్రాణి తనకర్మవాసనఁబట్టి తానుచేయు మంచిచెడ్డలకుఁ గలుగు సుఖదుఃఖము లనుభవించుననెడువార్త నీకుఁ దెలియదా? తన కర్మముచే, నీ నాథుఁడు హతుఁడయ్యెనుగాని సుగ్రీవునిచేతఁగాదు. దేహము నీటిబుగ్గవంటిదికదా? నీ విలాపముఁ జూచి నీ కొమారుఁడంగదుడు దుఃఖించుచున్నవాఁడు. తారా! నీవు పండితురాలవు. పృథివ్యాది భూతముల సంయోగ వియోగములు సతములుకావని నీవెఱుఁగుదువు. వాలి యిప్పుడు కాలధర్మము నొందెను. ఈ వాలి తత్వార్థముల నెఱిఁగినవాఁడు. ధర్మపరాయణుఁడు. పుణ్యాత్ముండు ఉత్తమలోకమును బొందినవాడు. ఇతనిం బూర్చి దుఃఖించుట యుచితముగాదు. నీ కొమారుని విషయమున దైవసమానుఁడగు రాముని వేఁడికొనుము. నీ నాథునకుఁ గాఁదగిన యపరక్రియ లంగదునిచేఁ జేయింపుము.

తార:—కపిసత్తమా! ఈ నాథుని వియోగమున నాకెట్టిదియుఁ దోఁపదు. అంగదునిఁ గాపాడుభారము పినతండ్రియగు యీ సుగ్రీవునిదికాని నాదిగాదు. తండ్రి వెనుక పినతండ్రియే తండ్రి. వాలి పరుండియున్న యీ శయనమే నాకును శయనము. ఇంతకన్న మఱేదియు లేదు.

వాలి:—కన్నులు తెఱచి (ఎదుటనున్న సుగ్రీవునిఁజూచి) సుగ్రీవా! నిన్ను వెడలఁగొట్టి నీభార్య నపహరించి పాపముఁజేసితిని. ఆ విషయమున నా దోషమెంచవలదు. దైవవశమున నాబుద్ధికిఁగలిగిన మోహమున నన్నుఁ బాపి యిట్టి యకృత్యమును నాచేఁ జేయించినదని తెలియుము. దైవవిధానంబు తప్పుదుగదా? ఇఁకనీవు వానరరాజ్యము పరిపాలింపుము. ఈ యంగదుఁడు గోముగాఁ బెంపఁబడిన వాఁడుగాన కష్టపడజాలఁడు, వీఁడు నాకుఁ బ్రాణముకన్న నెక్కుడు. వీనిని నీకన్నకొడుకుగఁ జూచికొనుము. దైవసమానుఁడగు రాముని కార్యము నెఱవేర్పుము. నా తండ్రియగు దేవేంద్రుండొసంగిన దివ్యకాంచనమాలఁ గైకొనుము. (అంగదునిఁజూచి) కుమారా! అంగదా! నేనుపోయెదను. ఇఁకనీ రక్షకుఁడు నీ పినతండ్రి. దేశకాలముల నెఱింగి ప్రియాప్రియములు గుర్తెఱిఁగి నడిచికొనుము.

తార:—(రామునిఁజూచి) రామా! నీవప్రమేయుఁడవు. జితేంద్రియుఁడవు. ధర్మాత్ముఁడవు. దుష్టసంహారార్థము మానవశరీరంబెత్తితివి. నీవే బాణమున నాపతినిఁ జంపితివో యదే బాణమున నన్నుఁజంపుము. కరుణాత్ముఁడవుగమ్ము. స్త్రీవధ దోషమని తలంతువేమో యదినాకు సంబంధింపదు. వాలియాత్మయే నేను. వాలినిఁజంపిన పాపము నన్నుఁజంపిన పుణ్యమున తొలఁగును.

సీ॥ తగునె నీవటు డాఁగి తరుచరునిఁ జంపఁ
బాడియే? యిదినీకుఁ బాపమయ్య?
అగునెయాయుర్వ్యమ వరశాఖిసోముఁడై
కోఁతినిఁజంపుట? కొలనుగాదె?
పాడియేయిదినీకుఁ? బాపకృత్యముగాదె?
పార్థివధర్మమే? పరమె? కాంచ?

అగునే? ధర్మాధర్మమరయ వేర? గురుశిక్ష
మఱచితే? యుతనీకు మాన్యవిధియె?

గీ॥ సతివియోగంబు పతికినిపతివియోగ
మతివలకునుండు సమముగా ననెడుమర్మ
మెఱుఁగఁజాలవె? యిన్నిటుచెలువనగునె?
భవ్యమేయిట్టి పనిరామ భద్రసతికి.

రాముడు:—వీరపత్నీ! ఇట్టి విరుద్ధబుద్ధి నీకుఁదగునా? సుఖదుఃఖయోగములు ప్రకృతి జన్యములు. నీకొక కొమారుఁడు గలఁడు. వానిపై జాలిదైనను బ్రాణిమఱి ఛింపకు. నీ కొడుకునకు యువరాజ్యంబీ సుగ్రీవుండిచ్చును. నిన్నన్నివిధముల రక్షించును. నీ పతికిఁ గాదగిన కార్యములు కానిమ్ము. దుఃఖమున ప్రయోజనమ్ము లేదు. (సుగ్రీవునిఁజూచి) సుగ్రీవా! ఆలస్యంబేల. నీయన్నకుఁ జేయఁదగిన యూర్ధ్వదేహిక క్రియలన్నియు నెరవేర్పుము. నేనీయతి వ్రతముఁబూని పట్టణముసొరరాను. కావున నీవీయుచితదినములు దొలఁచి పట్టాభిషిక్తుఁడవుగమ్ము. ఈ వర్షఋతువు గడచినవెంటనే నీ సేనను సీతాన్వేషణమునకుఁ బంపుము. నేనీయడవిని నివసించియుండెద.

సుగ్రీవు:—స్వామీ! తమ సేవానుసేవకుఁడను. తమ దాసుఁడను. తమవాక్యము దేవవాక్యముగ నమ్మి వర్తించెద.

రాముడు:—మంచిది, అటుసేయుము.

(నిష్క్రమము.)

## తురీయరంగము.

### సుగ్రీవాంజనేయ - రామలక్ష్మణులు.

సుగ్రీవుఁడు:—(రామలక్ష్మణులకు నమస్కరించి) మహానుభావా! వర్షాకాలము వెడలెను. సీతాదేవిని వెదకుటకు నా యాప్తుఁడగు వినతుని సేననిచ్చి తూర్పు దిక్కునకుఁ బంపినాను, సుషేణుఁడు మొదలగు వానరులఁ బశ్చిమదిశకుఁ

బంపినాను. శతబలి మొదలగు కపివరుల నుత్తరదిశకుఁ బంపినాను. ఈ మహాబలుని నాంజనేయుని, రావణుఁడున్న దక్షిణదిక్కునకుఁ బంప నాజ్ఞ యిచ్చినాను. వీనింగూడి యంగద, నీల, మహాబల జాంబవంతాదులను జంపయత్నించినాను. తమయానతి మఱియేద్దియో తెలుపవలెను.

రాముడు:—కపిశ్రేష్ఠా! ఈ యానవాలును గైకొనుము. సీత నిన్నుగుఱించి సంశయ మొందఁగాని, భయముఁగాని నొందకయుండునటుల నీయుంగర మా దేవి కిమ్ము. వీరాధివీరా! నీ యుత్సాహము, బలము, పరాక్రమము సమానములని నేఁ దెలిసియుందును. నీ నుండి కార్యసిద్ధియగునని నామనంబు తెలుపుచున్నది. ఆలస్యంబునకుఁ గాలంబు లేదు. కార్యసిద్ధి యొనర్చికొని త్వరలోఁ రమ్ము. ఒకవేళ దైవయోగంబున నా దుష్టాసురునిఁ గంటివేని వానింగూడి నా మాటలుగాఁ దెలుపవలసిన మాటలు గొన్ని వినుము.

సీ॥ బ్రహ్మకులంబునఁ బుట్టి బ్రహ్మజ్ఞుఁడై
పరదారహరణేచ్ఛ పాపమనుమ
రాముని శరవహ్ని రాఁజకముస్న్నె, యా
భామను విడి భువిఁ బ్రదుకుమనుమ
రామహస్తకృపాణ ధూమకేతువు లంక
కాలాగ్నిఁ బెలెనంటి కాల్చుననుమ
వాగ్వరపరబల దిగ్విజయంబులు
కల్లకావిపుడవి చెల్లవనుమ

గీ॥ వాలమున నిన్నుఁ జుట్టుచు వార్ధులెల్ల
సంచరించిన వాలినిఁ జంపెననుమ
మఱియు సమయానుకూలమౌ మాటలెల్ల
పలుకుమా, దైత్యభ్రమోలను భయము వదలి.

ఆంజనే:—మహానుభావా! నా తల్లి సీత, లోకమాత; శారీరావయవ సౌందర్యాతి

లక్షణంబులు, నాకుం దెలియవే? నేనాతల్లిని గుర్తించు టెట్లు? కావున నా దే విరూపటులుండునది నాకిం తుక తెలుపుము.

రామ.-సీ॥ రాజబింబము బింబరాజము నగు నౌర
మోముపసలరివి నుదితమోవి
మదమగమును, మృగమదమును నదలించు,
మేలంతకస్తవతివి మేనితావి
గంధనాగమునాగ గంధమునుం గేరు,
నారియానముతీరు నాతియారు
ఘనచక్రములంచక్రఘనరలం బొందోలు,
సతిజఘనంపుం బెంపు స్తనముసొంపు

గీ॥ బార్యచంపక సుమనాస, చంద్రహాస
కంబుకంధర, కాలాహికంధ చికుర,
సరసలావణ్య తారుణ్యసారసాంగి
మృదులపదకంజరంజిత; మేలంత; సీత.

ఆంజనే:—మహానుభావా! వందనంబు లర్పించెద. అనుగ్రహింపుము. పోయివచ్చెద.

సుగ్రీ:— అ ను బ ం ధ ము 14.

(నిష్క్రమణము.)

ద్వి తీ య ర ం గ ము.

ఆంజనేయుడు సముద్రము దాటును.

( నిష్క్రమణము )

తృ తీ య ర ం గ ము.

( కోటవాకిలి - లంకిణి - ఆంజనేయులు. )

ఆంజనేయులు:—ఏమి యీకోటపై భవము. శతయోజన సముద్రంబు దాటిన నా

ఈ నీకోట కాఁటుట దుస్సాధ్యమైనదియే? యీకోటఁబ్రవేశించుటకు సదుపాయం బొక్కటియే. ఈకవాటంబును బ్రద్దలగు నటుల నా ముష్టిచేఁగొట్టి వివృతద్వారంబు సంబ్రవేశించెద. ( అనుచుకవాటము నుగన్నను. అపుడులంకిణియను స్త్రీ ఘోరాకారమున నెదుటఁబడి )

లంకి:— ఓరీ- మర్కటాధమా- అద్భుతంబుగ నెచ్చటినుండి యిచ్చటికివచ్చితివి? అవార్యభుజబల శాలియగు రావణుఁడేలెడు మహానగరమిది. నీబొందెలోఁ బ్రాణంబులుండఁగనే నాకునీవార్తఁ దెలుపుము. నన్నుల్లంఘించి యెటుపోఁగలవు?

ఆంజనే:— ఓసీరాక్షసీ! క్రూరవచనంబులనన్నుఁ బెదిరించెదవా? అగాధనీరధిని లంఘించిన వానికినిన్నుల్లంఘించుట యెంతపని? నాత్రోవకు నడ్డముగ నిలిచెదవో? నాపాదములనిన్నుఁద్రొక్కెద. ప్రారంభమునఁనీవెవతెవైనది దెలుపుము.

లంకి:— ఓరీ. వానరాధమా; సమస్తానిమిష కంటకుండగు దశాస్యుని యాజ్ఞఁదల మానికంబుగధరించి యీపురము గాచుదానను. ననుఁగానకుండ నెవ్వరికిఁజొరంగరాని నీపురంబును నెటుజొరసాహసించితివి? నిన్నిపుడే సంహరించెద.

ఆంజనే:— ఓసీ నరాక్షసీ! ఈనగరంబునంగల విచిత్రవస్త్రములు, నవీనవనోపవనప్రకాండములు, నైత్తైసగోపురములును, విశాలములగు గృహకూటములును మణిహర్మ్యసౌధములును, వాపీకూపములును, నదులును, రాజగృహంబులును, గనుఁగొందుగఁ జూడవచ్చినవాఁడను.

లంకి:— ఓరీ! యుద్ధమున నన్నుఁగెలువక నీవీపురము జొరసలవిగాదు.

ఆంజనే:— రాక్షసీ! అడచిపడకుము. నేనీనగరంబుఁ జూడనిశ్చయించినవాఁడను. ఇదే మార్గమున నే మఱలివత్తును. ( అనుచు ముందరికిఁగాలిడును )

లంకిణీ:— ఓరీ! అల్పకపీ! నే వలదనినను ముందరికిఁగాలిడెదవా? యిదిగో నిన్నుఁబట్టి చీల్చెద.

లంకిణి:-కం॥ ఆఁగుగిడకు నిలువునిలువుము

ఆంజ:— చెడుగానీవడచి పడకు చెడుగగునీకున్

లంకి:— సుడుబుడుగుమపడిపొమ్మా

ఆంజ:— జడమతి నీకడిమి నడఁతుజడియకనిపుడే.

శ్రీ

# లంకాదహనము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

జాంబవంత- అంగద- ఆంజనేయులు- గజుఁడు- గవాక్షుఁడు- గవయుఁడు- శరభుఁడు- గంధమాదనుఁడు- మైందుఁడు-ద్వివిదుఁడు-సుషేణుఁడు- మొదలగు కపిసైన్యములు.

అంగద:— కపివరులారా! ఈవిస్తార సముద్రము మీరందఱుఁ గంటిరియా? ఇది శత యోజనముల విరివిగలదు. ఇంతటిసముద్రమును లంఘించు మహాతేజుఁడెవ్వఁడో నాకుఁ దెలియకయున్నది. ఏ మహావీరుని మహిమచే మనము మరల, మనదారపుత్రాదులనుఁ జూడఁగలమో నేనెఱుఁగక యున్నాను. [అంగదుఁడు మౌనము వహించియూరకయుండును.] కపివరులారా! మీరందఱును బలవంతులలో నెల్లమేలు బంటులరు. దృఢపరాక్రమశాలురు. మీరిటుమౌనము వహించుటకుఁ గారణంబేమి? సుగ్రీవాజ్ఞకు భంగముగ నెలదినములు గడువు మీఱితిమే దానికినే శీతిల్లి ప్రాయోపవేశంబునకుఁ బ్రారంభించితిని. ఆ సాహసము నుండి నన్నుమీరు మరలించితిరి. అయ్యో! నాఁడే స్వయంప్రభామాయా బలమున మడిసియుండిన యెంత క్షేమముగ నుండెను. కష్టపడియు మహాతపస్విని మహిమచే, బిలమునుండి వెలివడితిమి. సంపాతి యనుగ్రహమున సీతాదేవి యునికిపట్టుఁ దెలిసితిమి. అయ్యో! ఈ సముద్రము దాఁటలేక మనము వందురుచున్నాము. ముందు గతినాకెద్దియుఁ దోఁపక యున్నది.

గజ:— యువరాజా! అంగదా నేనుపదియోజనముల దూరము దాఁటఁగలను. అంతకు మీఱిననావశముగాదు. కావున నే మౌనము వహించితిని.

గవాక్ష:— మహాప్రభూ! నేనిరువది యోజనములు లంఘింపఁగలను. అంతకుంజె దవ్వునావలనఁగాదు.

గవయుడు:— వానరపతీ! నేను ముప్పది యోజనములెగరఁగలను.

శరభుడు:— వానరతిలకా! నేనలుబది యోజనములు కష్టపడి దాఁటగలను.

గంధమాదన:— కపిసత్తమా! నే నేఁబదియోజనములు లంఘించుటకే సందియము లేదు.

మైందుడు:— వనచరాగ్రణీ! నేనఱువదియోజనములు లంఘించ నుత్సాహింతును.

ద్వివిదుడు:— అంగదప్రభూ! నే డెబ్బది యోజనములు దాఁటఁగలను.

సుషేణు:— వానరపతీ! నే నెనుబది యోజనములు దాఁటఁసాహసింతును.

జాంబవంతు:— వానరులారా! పూర్వము నాకును లంఘించుటయందు పరాక్రమముండి నది. ఇప్పుడో వయసు పూర్ణముగా ముదిరి ముసలివాఁడ నైతిని. అయినను రామకార్య సాధనకై తొంబది యోజనములు లంఘింపఁగలనని నామన ముత్సహించు చున్నది. ఈ నా ప్రయత్నము చాలదు.

అంగదుడు:— వానరయోధులారా! ఇఁక నా శక్తి నేఁ జెప్పెదను వినుఁడు. నేనీనూఱు యోజనములను దాఁటిపోఁగలను గానిమరలి వచ్చుటకు నాకుశక్తి యుండు నో లేదో నిశ్చయముగఁ జెప్పఁజాలను.

జాంబవం:— అంగదా! లంఘనమందు నీ శక్తి యసదృశము. నూఱు యోజనములే కాదు వేయియోజనములైనను లంఘింప నీవు సమర్థుఁడవు. మా కెల్లరకునీవు స్వామివి. భృత్యులకు స్వామి యాజ్ఞాపించుటయు, భృత్యులటు నడచు కొనుటయు స్వామిభృత్యన్యాయముగ నున్నది. భృత్యులు స్వామిచేఁ బనిగొనుట యుక్తముగాదు. పరంతపా! నిన్ను రక్షింప మేమందఱము కంకణబద్ధులమై యుండవలెను. నీవు కార్యవస్తువు. వృక్షంబునకు వేరు బలె నీవు మూలభూతుఁడవు.

అంగదుడు:— జాంబవంతా! కార్యసాధనకు మీరును వెడలక నేనును బోవక నిలిచి నచో మరల మనమందఱము ప్రాయోపవేశమును జేయవలసిన వార మేకదా? దీని దప్పింప వేఱొక యుపాయంబు నీవరయవలయును గాని నా కెద్దియుఁదోఁపక యున్నది.

జాంబ:— (ఆంజనేయులఁ జూచి) వానరలోకవీరా? సర్వశాస్త్రవిశారదా! ఏకాంత స్థలమున మౌనముని కూర్చుంటివేల?

ఆంజనే:— సుహృద్వరా! నాబలము నేఁ దెలియక, వృద్ధభావమలో దిగక మానసము వహించుట మేలని యున్నవాఁడను.

జాంబ. ఉ॥ వేగమునందు నీ జనకు వేగము మెచ్చవు శక్తి నందు మో
యాగుహు మెచ్చకుందువు దినాధిపు మెచ్చవు తేజమందునన్
భోగినివాక్యసంపదలఁ బోనడఁగింతువు, నీకశక్యమే
సాగరలంఘనమ్ము? కనఁజాలవు నీబలమీవు మారుతీ.

పశంతాపా! నీవు తేజమునను బలమునను వాలిసుగ్రీవ తాపులత్ములకు సమానుఁడవు. జవపరాక్రమంబుల సుపర్ణునిఁ బోలెదవు. నీకుంగల బలమును బుద్ధియును, తేజమును, ధైర్యమును, మఱియేభూతములయందు కానరాదు. మునిశాపవశంబున నిన్ను నీ వెఱుఁగక యున్నావు. పుంజికయను నప్సరస్త్రీ, శాపవశంబునఁ గుంజరుఁడను వానరునకుఁ గూఁతురై యంజన యనునామంబున నీమాత గాంచెను. అంజన సర్వాంగ సుందరియై మానవ స్త్రీ రూపముధరించి యుండినప్పుడు వాయువామెం గూడ నంజనాదేవి వానరతిలక నిన్నుఁ గనెను, నీవు బుట్టినతోడనే యరుణునిఁ జూచి పండని తలంచి దానిం బట్ట గగనంబున కెగరితివి. ఇంద్రుఁడు నీపైన వజ్రాయుధము బ్రయోగించెను. అది నీ యొడమ హనువు తగులుటచే నది విఱిగెను కావుననే నీకు హనుమంతుఁడని నామంబు గలిగెను. ఇంద్రుఁడు నీయెడఁ గొనర్చిన శిక్షకు నీతండ్రి వాయువు కోపించి ప్రపంచమున వీవకయుండెను. అపుడు సమస్తదైవములు భీతిల్లి నీకు వరంబు లొసంగిరి. నీకు స్వేచ్ఛామరణంబుఁ గల్గునట్లింద్రుఁడు వరంబిచ్చెను. వేగంబున నీవు వాయుసమానుఁడవే గాక లంఘించుట యందును వానిఁ బోలెదవు. ఈ కాలమందు మాతో నెల్ల శక్తిగలవాఁడవు నీవేను వానరసింహా! నీపరాక్రమముఁ గన్నులారఁ జూడఁగోరి వానరులెల్లరుఁ గాచియున్నారు. ఈ సాహసకార్యంబు నవలంబింపుము.

ఆంజనే. — జాంబవంతా! నీవు త్రిలోకవార్తలు దెలిసినజ్ఞానివి, మునుల శాపంబున నా బలము నేఁ దెలియక యుంటిని. వాయుపుత్రకుమారుఁడను నేను గాపున

యీనూఱు యోజనములేగాదు. పదివేలయోజనము లయిన దాఁట గలను. ఇప్పుడేయీకార్యంబునకు హుంకరించెద. శ్రీరామానుగ్రహంబున నిప్పుడిట్టె నర్గెద. సెలవిండు.

జాంబ:—వీరాగ్రణీ! కేసరిపుత్రా! వాయుకుమారా! హనుమంతా! సమస్తవానరులను క్షమువోఁగొట్టితివి. మహాఋషుల యనుగ్రహమున సముద్రమును దాఁటుము. నీ మంగళముగోరుచుఁ గపులందఱు నిచటనే నిలిచియుందుము.

ఆంజ.—

## అ ను బ ం ధ ము 15.

( నిష్క్రమము )

ఆంజనే:—రాక్షసీ! నీవు స్త్రీవి కావున నినుఁజంపఁజాలక యూరకయుంటిని. ఇవుడు నీవై పైఁబడి నన్ను చెనకితివి. ఇదిగో పిడుగువడులాగున నీ శరీరముపై నా పిడికిటఁ బొడిచెద.

## అ ను బ ం ధ ము 16.

రాక్షసి:—( హా.యనిక్రిందఁబడి లేచి ) కపివర్యా! ననుఁజంపకుము. కృపచేరక్షింపుము. నీచే నిర్జితనైతిని. మున్ను వనజాసనుండొకానొక సమయంబున నన్నుఁ గరుణించి యేనాఁడొక వానరుఁడువచ్చి నిన్నునిర్జించునో యానాఁడే యీ లంకానగరమునకుఁ జేటువచ్చుననిపలికెను. ఆపలుకును నేఁటికి సత్యంబయ్యె నీదు దర్పమున క్రూరరాక్షసులందఱుఁ గూలఁగలరు.సమరమున పంక్తికంఠుఁడు చావఁగలఁడు.నీవుజనకజను, వెదుకవచ్చిన రామునిదూతవని నేనిప్పుడు తెలిసికొంటిని. నీకువందనంబులిడెద. లంకనికఁ బ్రవేశింపుము.

( నిష్క్రమను. )

## ద్వితీయరంగము.

## అ ను బ ం ధ ము 17.

ఆంజనే:—ఆహా! సీత, జగన్మాత! ఎందువెదకినను గానరాదు. అయ్యో! లంకాధిదేవతా జయంబుచే సీతాన్వేషణ సహకారిణి కీర్తి నాపాలివునని దలంచితి నిష్ఫలమయ్యె. సీతాసందర్శన రహితుఁడనై నేనిప్పుడేమిసేయుదు? జానకినిఁ

గానఁ నేనుమరలితినేని వానరులెల్లరు మేనులు విడుతురు. నేనిచ్చట నేజత్తునంటినా జానకి వార్తఁదెలియక రామలక్ష్మణులు దుఃఖించిచత్తురు. నేనగ్నిఁబ్రవేశించి మేనుబాయుదునంటినా యది పాపకార్యంబు. బ్రదికియున్న శుభములుబడయవచ్చునని పెద్దలాడిరిగదా! కావున బ్రాణంబులు ధరించెద. ముచ్చిలి మత్సరబుద్ధిని నీరాక్షసాధముఁడు సైదేవినిఁ దెచ్చెనుగదా? వానిఁ బ్రచ్చి వధించిపుచ్చెద. లేదా, వానింబట్టి రామునివద్దకుఁ గొనిపోయి పశుపతికి బశువు బలియిచ్చినరీతి, రామునకుఁ బిశితోప హారంబునిచ్చెద. ఆహా! ఈ తలంపులేల? మరల నీ లంకను నిశ్శంకముగ వెదకెద. ఈ వనము వివిధఫలవృక్ష సంగతిచే సొంపుగులుకుచున్నది. దూరంబున మహోద్యానంబు నయనాభిరామంబై యున్నది. రాక్షసులఁ గాననటుల అందుఁ బ్రవేశించి సీతను వెదకెద. రాక్షసులెవరేని నడ్డుపడిన వారిని సంహరించెద. దిశాధిపతులకందఱికిఁ ద్రికరణశుద్ధిగ వందనంబొనర్చెద. రాముని, సుగుణాభిరాముని డెందంబునఁ నిలిపి యహోరాత్రములు స్మరించుచుండెద. చంద్ర సూర్యులారా! దిశాధిపతులారా! మునీంద్రులారా! సిద్ధ సాధ్య కిన్నర గరుడోరగాది భూతపతులారా! మీరందఱు మదీయాభిమతంబు సిద్ధింపఁజేయుదురని ప్రార్థించెద. ( అనుచు ముందరికింబోయి ) ఆహా! ఈ వసంత సమయాంకురిత పల్లవిత కుసుమిత ఫలిత లలిత విభ్రాజిత తరువ్రాతంబు కన్నులకు విందుగనున్నది. మయూర శుకశారికామధుకర, మధురగానంబు మనోహ్లాదంబుగనున్నది. క్రూరరాక్షస రక్షితంబైన యీ యుపవనంబు నేఁజొచ్చి జానకి నన్వేషించెద. ( అనుచు ముందరికి రెండడుగులునడచి ) ఆ దూరంబున నగపడెడు శింశుపావృక్ష సంజాతంబు గగనము చుంబించురీతి నెత్తుగ బెరిగినది. దానినెక్కి నలుదిక్కులం గలయం జూచెద. ఈ యుద్యానవనంబునందెల్ల నిది మిక్కిలి మనోహరమైన ప్రదేశంబుగనున్నది. ఉద్యానవనవిహారంబున సీతసదాకాలంబుఁ బ్రొద్దు పుచ్చుచుండునని రాములు బలికియుండిరి. కావున నిందెందైనను నా మహామాత యున్నదియేమో చూచెద. ( అనుచుఁగొంచెము ముందరికి జరిగి ) ఆహా దూరంబున లిప్తకాంచన వితర్దికా శోభితంబును బ్రవాళ వికచిత సోపానంబును, గాంచన స్తంభ సహస్రనిర్మితంబును, వివిధప్రాకార సౌధా

వృతంబునుగల యొక ప్రాసాదంబు కట్టెదుటఁ గనబడుచున్నది. ఆ ప్రాసాద మణిమయ వేదికాతలంబున యువతియొక స్త్రీ చూపట్టుచున్నది. శుక్లపక్షాది చంద్రరేఖయుంబోలి, ధూమజాలావృత పావక శిఖవలెఁ, బద్మినిగలి నొప్పారు నా మానిని యెవరుండును? (ఇంకను సమీపించి) కట్టా! ఈ సుందరాంగి మలినవస్త్రముగట్టినది. పాంశు పరిమార్జిత శరీరమున బ్రజ్వలించుచున్నది. వదనకంజము నూర్పులచే పాడఁజేయుచున్నది. నయనంబుల నశ్రులు గార్చుచున్నది. శ్వాన మధ్యమున జిక్కిన లేడిబలె రాక్షసీకాంతల మధ్య గృశించుచున్నది. కుజగ్రహపీడితయైన రోహిణీసతిక్రియఁ జెలువుదక్కినది. ఏకవస్త్రగనున్నది. అంగాంగ సౌందర్యంబు రాములచే నిరూపింపఁబడినరీతిగనున్నది. తీవ్రదుఃఖాభిత ప్తయై బాసువారిన పుల్లికావల్లికగిది వాడుచున్నది. అనిలహతలతబలె సదలుచున్నది. భుజగసతిభంగి నూర్పులు విడుచుచున్నది. మిథ్యాపవాదంబున నశించిన కీర్తిరీతి, సకలుషయైన బుద్ధిమాడ్కిఁ గాలిమేఘ పరివృతయైన చంద్రప్రభభంగి, చంద్రుఁడులేని రాత్రిరీతి, జంటబాసినజక్కవ చెలిభంగి, సూర్యుఁడులేని దినము బలెఁ గుందుచున్నది. (మరల కొంచెము సమీపించి)

సీత:- హారామా. హారామా.

అనుబందము 18.

ఉ॥ రా రఘురామ రాక్షసవిరామ విశాలయశోభిరామ రా
రా,రవివంశధామ మధురాక్షర పావననామ రావదే
రా, రణరంగభీమ సువిరాజితసుందరకామ ప్రోవఁగా
రార, త్రిలోకధామ సతిరక్షణ నీకదినిండు భారమా.

ఆంజనే:— అయ్యో! ఈ భువనసుందరినాథుని విరహసంతాప ప్రణష్టయై "హారామా హారామా" యనియఱచుచున్నది. ఎంతటిఘనునికైనను విధిదురత్యయంబు గదా?

సీ॥ ఏరమామణి ధరనారీ మణిగఁబుట్టె
జనకుతపః ఫలజాతయగుచు

ఏదేవినిఁగోరి యాడేపదేవపుండు
గౌరీధవునివింటి కడిమిఁద్రుంచె
ఏరామనరయుచు నారాముఁడడవుల,
నిడుములఁబడుచుండు జడునిభంగి
ఏవాలుఁగంటికైవాలిని నొకకోల,
నేలఁగూలిచెనవలీలగానుఁ

గీ॥ ఏసతికిఁగాను రఘురాముఁడేఁపుమాపె
ఖరవిరాధవిరోధరాక్షసులనెల్ల
నామహాదేవి పతిహితయవనిజాత
సీతఁగంటినిఁ త్రిభువనమాతఁ నిండు.

అహా! అనీచచరితుఁడు రావణుఁడీచకోరాక్షినిఁదెచ్చి యింతగనేఁచు చున్నవాఁడే?

ఉ॥ ఆజిని శత్రురాజఁదెగటార్చిన యాజికి ముద్దుకోడలై
యాజనకాధినేతకు సుఖాస్పదమైన, యనుంగుఁగూఁతురై
యా, జముఁడడ్డగించినను నంజని శ్రీరఘురాముదారనై
యాజరఠాసురాహులకునీఁగెడుబాల్యదెఁబ్రాణవాయువుల్

(అనుచు దూరంబునుండి సీతకు మానసాభివందనంబొనర్చి సమీక్షింప నుత్సహించుచుండ, రావణుఁడు దాసీజన పరివేష్టుఁడై ప్రవేశించును. ఆంజనేయులు రావణుని దవ్వుసఁజూచి) (స్వగ) అహా! వీఁడు రాక్షసవతంసుఁడగు దశకంధరుఁడుగాఁబోలు. మనోజశాత శరవంచితుఁడై యిటుపచ్చుచున్నవాఁడు. ఈ పరమపతివ్రత నా దురాత్ముఁడేమి దురుక్తులాడునోమఱుగుననుండి వివిరెద. (రావణుఁడు సీతను సమీపించి)

రావ:— అనుబంధము 19.

రావణ:—సీతా! కల్యాణగుణసమేతా! సముద్రమధ్యంబునఁ భిన్నమైన నావపగిది యేలవ్యసనముచేఁ జలించుచున్నావు? భూతలపతితయైన వనస్పతి శాఖలాగున నేలవాడుచున్నావు? ధూమకేతు గ్రహంబుచే, ధూష్యమానయైన రోహిణికరణినిల నవియుచున్నావు? పతిశోకాతురత శుష్కించుచు సంస్కారహీనయై, సౌకుమార్యంబు విడుచుచు నుపవాసకృశాంగియై దూలుచు, నిరానందయై, చింతించుచున్నావేల?

ఉ॥ సారసగంధి, నన్నుఁగని, చారుపయోధరచక్రయుగ్మముక్
చీరచెఱుంగుచేనదిమి చిక్కులఁబెట్టెదవేల? యంగముల్
వారిజనేత్రఁ జీతిలుచు, వావిరిదాఁచెదవేల? దేహశృం
గారము సేఁగనర్హగద? కాంతరొ, యాననమెత్తిచూడుమా.

మానినీమణీ! నన్నుఁజూచి భీతిల్లెదవేల? అంగములు దాఁచుకొనియెదవేల? భామా! నా యసమాన భుజాబలమునకు నీ త్రిజగంబున నెవ్వఁడుంగాని యీడు లేడు. తన్వీ! పరభామల బల్మినిబట్టి పరిభవించుట, దనుజులకు స్వధర్మమైనను, నీ యనుమతి లేక, నిను బొందిన సుఖంబులేదని వదలితి. చెలీ! ననుఁజేరి యానందంబున నుండుము. హరిణాయతాక్షీ! మలినాంబరములు నీకేల? మణిమయాంబరములిచ్చెద. మృష్టాన్నములుండ నుపవాసంబులనేల గ్రహించెదవు? పుష్పమయ శయ్యలుండ ధరణీతల్పంబు నీకుఁదగునా?

ఉ॥ తోయజలోచనా, వినవె, దుఃఖముమానవె, మోదమూనవే
కాయజువిక్కటారి, విను, కామినిఁగానను గూడితేని నీ
శ్రీయు, సుఖంబులున్ జెలువు సిద్ధము వృద్ధినిఁబొందు నమ్మవే
చేయుదు నా సతీమణుల జ్యేష్ఠఁగ నిన్నుఁ ద్రిలోకపూజ్యగన్.

జవ్వనీ! సుఖాస్పదమగు యౌవనము కడతెగిన వెనుక మరలవచ్చునే? ప్రవాహమున నీరు సముద్రముజేరిన వెనుక మరలవచ్చునే? సౌందర్యవయశ్శాలినియగు నినుఁజూచి, రే మానవుఁడు, మానసమున చలింపక యుండును? సరసిజాననా? నన్నులిని సరసిజాంబకక్రియల ననునేలితివేని, నీ జననీజనకులు బంధువులు యవనీతలంబున సుఖంబున మనుమను. కృశాంగీ! కృశవయస్కను, ననల,

కృతాంగివయ్యును, మలినసంవీతయయ్యును, నావుదికి వేడుకపుట్టించుచున్నావు. నిన్నుఁగని స్వదారలందు నే ననురక్తి వదలితిని.

సీత:—( ఒక తృణంబుఁగైకొని దానిని ముఖంబున కడ్డంబుగ నిడుకొని ) దనుజపాంసనా! దశకంధరా! నా మీఁది మనము విడువుము. నీ చిత్తంబు నీదారలందిడుము. ఖలునకు మోక్షసంసిద్ధి గలుగునే? మహాతపస్వియైన జనకరాజ సత్కులమునఁ బుట్టితి. అరిందముఁడగు దశరథునకుఁ గోడలనైతిని. దేవశ్రేష్ఠుఁడగు రామునకుఁ బత్నినైతిని. ఇట్టి పతివ్రతనైన నేను నీ మోముదిక్కునైనఁ జూడనగునా? నీ సతి నీచేనెటు రక్షితయగునో నేనును నాపతిచే రక్షితను. పతివ్రతను.

మ॥ ఖల, నీచాధమ నోరుమూయుమిఁక, నోకష్టాత్మ చాలింపుమా
పలుభాషల్ పొగురెక్కియాడకుసుమా, పాపంబు,శ్రీరాము,దో
ర్బలమానంబును, నీదుమామను భవానీభర్తచాపంబునుం
దెలియంగా వేఁడును, బుద్ధిఁదెచ్చికొనుమా నిర్భాగ్య; మేలందుమా.

రావణా! కాముకుఁడు స్వకృతదోష హన్యమానుఁడు, వానిమరణమున భూతకోటి మోదమందును. సూర్యునిఁ బాయని ప్రభరీతి రాముని నా చిత్తము బాయదు. సువ్రతస్నాతుఁడగు విప్రుని విద్య వదలనిరీతి, దాశరథిని నా మానసము త్యజింపదు. నీవు ధరఁ బ్రదుకఁ దలఁచితివేని, నన్నా రాముని పరమదయాళుని భక్తవత్సలుని సరసఁ జేర్చి, శరణని యతని చరణములపైఁ బడుము. శరణాగత రక్షకుఁడా మహానుభావుఁడు. సువర్ణుఁడు పన్నగమునుబట్టి వధించి సుధనుగొనిపోయినరీతి నారాముఁడు నిన్ను వధించి నన్నుఁగొనిపోవును. సందియము వలదు. రామలక్ష్మణులులేని సమయమునఁ జౌర్యవృత్తిని నన్నుఁబట్టి తెచ్చితివి. ఆ నృపశార్దూలముల మ్రోల రాక్షసశ్వానములు నిలుచునా? ఓరీ రాక్షసాధమా! వినుము వృత్రమును గడిపినరీతి నిన్నుఁ రాముఁడు గడుపును. విష్ణువు రాక్షసులనుజంపి లక్ష్మిని గొనిపోయినరీతి, నన్నుఁగొనిపోవును. దుడుకుమాటలాడకు. హెచ్చరికసుమా:

రావణుఁడు! ఉ॥ కామినికానవే, విషయకాంక్షలుగల్గినకామకుందుం,తా
గామితముల్ఫలింపఁదగుకార్యమురిత్తఁగఁ బోవనిచ్చునే

కామినియల్గినఁ గలఁటఁగాలునఁ దన్నినఁ దిట్టుచుండినన్
కామునకు లక్షణంబులివి, కాదనఁబోవు నీపై నెఱదోషముల్!

పారిజగంధీ! కామశరాహతులగు మగవారు భామలతిరస్కారవాక్యములకుఁగినియరు. నీవిన్ని దురుక్తులాడినను, నీపైనేఁ గోపింపను. మదనార్తులై యుండు మగువలను వేఁడినట్లెల్లను గినిసి కానిమాటలాడుట కాంతలకుధర్మము. నీవుకోపగించినట్లెల్లను నీవుప్రియకాంతవని నీపైఁ గరుణ హెచ్చుచున్నది.

## అనుబంధము 20.

సీత:— ఓరీ! దివిజవిరోధీ! నాథ రత్నులరిపు సన్నిభుఁడు. నేను పతివ్రతను. మావిషయమునఁ బాపపుఁబలుకులుఁ బలికి రాక్షసకులనాశనంబరయుదు వేల? రాముఁడుగంధసింధురము నీవో శశకము. ఈ తారతమ్యంబు చక్కఁగఁ గమనింపుము. నావిషయంబునదుర్వాక్యంబులాడితివేని నీనాలుక దునిసిపడును. ధర్మమునకు హానియని నిన్నుశపింపనైతిని. ఓరీ! పఙ్క్తికంధరా! రామబాణ పాథోరాశిని. నీవు మునుఁగకు హెచ్చరిక.

రావణుః— సీ॥ రాముఁనిశరవార్ధి రావణా గస్త్యునిఁ
జేరినిల్చుట యెటు చెలువు వన్న?
గండభేరుండము కైవడి కామపం
చాస్యంబు త్రింగఁ గాదనఁ దివవినవె?
పర్వతములఁ గూల్చు పాకశాసనుఁడు నా
పాకశాసనుఁడయ్యె పడతి వినవె?
రాజీవబంధుఁడు రావణుగృహమున
రాజిలుదాసుఁడై రోజునతివ

గీ॥ తార్క్ష్యఁడతివరో నాయింటిదాసుఁడయ్యె
గాననాఖేతినాకును గాదరాదు

మానవాధముఁ బేర్కొన మాన్యమగునె
మానినీమణి యుడుగుమా మాటలిఁకను.

సీత:—సీ॥ రావణా వినుమిది రాముఁడు శరవార
నీరాకరములోన నిన్ను ముంచు
రావణా నిన్నుఁ బట్టి రామపంచాస్యంబు,
కరిరాజునుం బలెఁ గలఁచి చంపు
రావణా నీకాంతి రఘురామసూర్యుండు
రాజీవముం బలెఁ దాఁచివైచు
రావణా పడివేయు రామసుత్రాముండు
గిరులను బలె నీదు శిరములెల్ల

గీ॥ రావణా నిక్కనీల్గకు; రామవీనుఁ
డహినిఁ బలె నిన్ను నెత్తుచు నడఁచు నేల
రావణా నీదు రోగము బోవఁ జేయు
రాముఁడి వ్యౌషధము; నిక్క రాక్షసుర.

రావణు:— మానినీ! అపగతసామ్రాజ్యుండై దారిద్ర్యంబున నవియుచున్న హీనమానవునిఁ బెద్దచేసి సర్వసంపదచే నొప్పారు నన్ను నవమానించితివి. ఇప్పుడే నిన్ను నాశంబు నొందించెద. [రాక్షసస్త్రీలం గని] స్త్రీపిశాచములారా! మీరెల్లరు సామభేదదానదండోపాయముల నెఱపి యీతరుణి నాకు వశగతయగున ట్లొనర్పుఁడు. అటు మీరు రెండుమాసములలోఁ జేయకేని మిము సంహరించెద.

[రావణుని నిష్క్రమణము].

పద్మాక్షి:—[సీతం జూచి] తరుణి! దశకంధరుఁడు, పులస్త్యమునిమనుమఁడు. తనుజను

ఖుర్యుఁడు. విభవోజ్జ్వలుఁడు. ఇట్టిపురుషుని లలనామణి యగుటకు నీకేసం శయంబు? వానిభోగభాగినివయి సమస్తభోగంబులనుభవింపుము. భామా! ఎవ్వనిభయమున సూర్యుఁడెండఁగాయ వెఱచునో వాయువు వీవనోడునో జలదంబులు తోయంబులఁ గురియుచుండునో, పావకుఁడు తన వేడిమి చూపఁజాలఁడో యట్టిబలాధికుఁడే రావణుఁడు దేవాంగనలవలె గంధర్వ సతులసాంగత్యంబు డిగి పన్నగాంగనలసంబంధమొదలి, దైత్యభామల పొందుడించుబలఁడి మర్త్యభామినియగు నిన్నుఁ బతిమాలి వేఁడుకొనుచుండ నీకేలయింతటిగర్వము?

సీత:— రాక్షసమానినులారా!

ఉ॥ మానినులార, నేఁబతిని మాన సతీహితవృత్తిమాన; నా
మానసనేతసంస్మరణ మానను నెంతటిముప్పువూడినన్
మానిని యెత్తుఁజేబతికిమానితమైన నగంబుమేనుగా
దేని నరవాసనన్వదల దీప్తినశించునుగాదె వెంటనే.

మీ రెన్ని చెప్పులుగఁజెప్పినను లోకనిందితంబగు గార్యంబు నాచిత్తంబుదూర వేరదు. నాభర్త రాజ్యవిహీనుఁడైననేమి, మానవుఁడైననేమి దీనుఁడైననేమి మునిరూపైననేమి నే వానికిఁ ననురక్తనై తిని కావున వానిని మానను. శచికినింద్రునిబోలె, సువర్చలకుఁ సూర్యునిబోలె, అరుంధతికి వసిష్ఠునిబలె, సావిత్రికిఁ సత్యవంతునిభంగి రోహిణికిఁ చంద్రునిమాడ్కి, గౌరికిశంభురీతి, శ్రీపతికిఁ లక్ష్మికరణి, లోపాముద్రకుఁగలశసంభవునిమాడ్కి వాణికిబ్రహ్మరీతినాకు రాముఁడు ననురక్తుఁడైనవాఁడు.

రాక్షసస్త్రీలు-దుర్ముఖి:—ఒసీ! వనమునజీవము విడిచిన మనుజునిపైనీకేలయింతమమత? రాక్షసవంశాధిపునకు సతివగుము. కాదేనినీక్షణంబుననిన్నుఁ బట్టిభక్షించెదము.

సీత:— అమ్మలారా! ననుభక్షించిన భక్షింపుఁడు. మీవచనములు నాకుసహ్యములుగావు (అనుచునశోకవృక్షమునుఁజూచి) అయ్యో! నేరాముని వీక్షింపనేని నొకనిమిషమైన జీవించియుండఁజాల. వితతదుఃఖంబుచే నుంటకన్నను మేను

విడుచుట మేలని నాకుం దోఁచెను. (అనుచు కన్నీరు గార్చును.)

ఉ॥ తప్పితిఁ బుట్టినింటికిని, దప్పితి మెట్టినయింటికిన్నటా
తప్పితి దండకాటవికిఁ దప్పితి గౌతమితీరభూమికిన్
దప్పితిఁ బ్రాణనాథు చరణంబులఁ బావనమౌ ధరిత్రికిన్
దప్పఁగ నైతిఁ బాతక విదారుణ ఘోర నిశాటవాటికిన్.

రాక్షసస్త్రీలు దుర్ముఖి:— ఓసీ హీనమానినీ! సామమున నేమెంత జెప్పినను నీవు వినవు. దానవేంద్రునిఁ బొందనొల్లవు. కావున నిపుడే నిన్నుఁ బట్టి మ్రింగెదము. (అనుచు మైఁబడఁ బోవుచుండ).

త్రిజట:— [నిద్ర లేచి] రాక్షసస్త్రీలారా! రామచంద్రుని సతిని మ్రింగవలదు. దశరథసుతునకు విజయము దశముఖునకుఁ జేటుఁ గలుగునని నా స్వప్నమందిపుడే తెవరో విశదంబుగఁ బలికినట్లాయెను. మానినులారా! శుక్లమాల్యములు ధరించి చారుదుకూలములు మేనఁ దాల్చి నిర్మలశిబికాధిరూఢులై రామలక్ష్మణులిచటికి వచ్చుటఁ గంటిని. ఆ రాముఁడు సుగుణాభిరాముఁడు దనుజాలఁ ద్రుంచి యీ దేవినిం గొని యుత్తరదిశకుఁ బోయినది గాంచితి. నా పెత్తండ్రి రావణుఁడు తైలసముద్ధూళితుండై రక్తాంబరధారియై పానమత్తతఁ బుష్పకవిమానంబునుండి నేలంబడినట్లాయె. ఖండితశిరస్కుండునై యొక్క వనితచేత నాకర్షింపంబడె. ఖరయుక్తంబయిన రథం బారోహించి వికలంబుగ నృత్యంబొనర్చుచు భ్రాంతిచిత్తుఁడై బరిభ్రమించినట్లయ్యె. రాసభంబు నెక్కి దక్షిణాభిముఖుఁడై జనియె. ఉన్మత్తునింబోలె దిగంబరుండై మలపంకంబునం బడియుండెను. రక్తాంబరధారిణి యగు నొకరామ, రావణుని కంఠంబున పాశంబుఁ దవిలించి దక్షిణదిక్కునకీడ్చె. ఆరీతిగనే కుంభకర్ణుఁడయ్యె. రామకింకరుఁడగు నొకవానరునిచే లంక భస్మీభూతంబైనట్లయ్యె. ఇట్టికలఁ గంటిఁ గావున శ్రీమహిమాత్ముఁడగు రాముఁడు సంగ్రామమున రావణుని జయించి యీ రామను గొనిపోవును. లంకకు నాపద గలుగును. ఈ మహాదేవికి మీరెల్లరు మ్రొక్కుఁడు. మనల నెల్లనుఁ గృపాదృష్టి నీ తరుణీలలామ గాచును.

రాక్షసస్త్రీలు:— (సీతకు నమస్కరించి దూరంబునకుఁ జనుదురు.)

సీత:— (నిట్టూర్పు విడుచుచు) హా రామా! నేనిచ్చోట భవత్పాదాంబుజంబులు భక్తిం జింతింపుచు నీనామంబుఁ బఠించుచు, మదినిన్ను భావింపుచు నుంటిని. నీకుదయ యురాదయ్యె. ఇక నే ప్రాణత్యాగంబుఁ జేసెద. గరళమునకు కఱవు లేదు. దానిం గ్రోలెద. నిశాతఖడ్గములు పెక్కు లున్నవి. వానిచేఁ దల ద్రుంచి కొనియెద. ఎవ్వరుం దొరకవేని నాకు భూషణముగ నెల యు వేణిచే నురిబెట్టుకొని చచ్చెద. ఏమిది. నావామనయనంబు జలించుచున్నది. నావామభుజంబదురుచున్నది. ఏతాదృశశుభ నిమిత్తంబులచేఁ నాకు మేలగుననిదోచెడు.

ఆంజనేయుడు:——( క్రిందికిదిగి దూరంబునకు వచ్చి )

అనుబంధము 21.

ఆ॥ ఏమృగాక్షి వెదుక, నెల్లబలీముఖు
లఖిలదిశలకరిగి రామృగాక్షిఁ బుణ్య
సాధ్వి నాదు పుణ్యవశంబునఁ
సురుచిరముగ నిచటఁ జూడఁగంటి.
[ముందరికివచ్చి]

ఉ॥ కంటినిఁ గంటిజానకినిఁ గంటిని నే రఘురాము దేవినిన్
గంటిని లోకమాతనిటు, కంటిమనంబును, గంటిధన్యతన్
గంటినిఁ బూర్వజన్మకృత కాంక్షితదివ్య ఫలంబు నేఁడు, నా
కంటికినిద్రబట్టు నిఁకఁ గర్జము కాంతను నూఱడింపఁగన్.

మహనీయగుణుండగు నాదేవదేవుని రామవిభుని పత్నిని వీరమహా పతివ్రతను కనులారఁ జూడగంటిని. ఈమె వ్రతశోకార్తయై విలపించుచున్నది. ఈ నాతల్లిని సమీపించి యూరార్చెద. భయభ్రాంతాత్మయై దూలుచు పతిదర్శనమాత్మఁ గోరుచు నీ కల్యాణి నివసించినది. ఈ సతిని సత్యంబిత సాంత్వన వాక్యముల నాశ్వాసింపకయుంటినేని నేమగునో? ఆహా! ఈ దేవి, నే, మాయారూపమునుఁ గొనిన రావణుఁడని సందియించి భీతిఁ జెందునే మోగదా! [అనుచుచాటుననిలిచి] ‘‘ దశరథునకు

కల్మషవర్తనుఁడగు సుతుఁడు రాముఁడను పుణ్యశీలుండుండెను. అతఁడవార్య శౌర్యుఁడు. ఆశ్రితపోషణుఁడు, జనకవాక్యపరిపాలకుఁడై వనంబుఁజేరి తనసతియగుజానకిఁ గోల్పోయెను. అనేకకోటిరాక్షసులఁజంపెను. సుగ్రీవునకభయంబొసంగి వాలినివధించెను. ఆమహామహుని దారనన్వేషించుటకునై కపులనేకులు దశదిశలకు వెడలినారు. నేనుసంపాతిచెప్పిన సరణి నూఱుయోజనంబులంబునిధిదాఁటి లంకఁజొచ్చి పతివ్రతాతిలకంబైన యీ మహాదేవినిఁగనుఁగొంటిని.

(అశోకవృక్షమెక్కి కూర్చుండును.)

సీత:— గీ॥ సరసమృదుపదయుత రామచరితసుధను
చిలుకుచును రామనామంబుఁ బలుకుచుండు
రామనామము విషమను రాజ్యమందు
నెవఁడో? యెటువచ్చెనో? యేమినెఱుఁగరాదు?

ఆహా! ఈమధురధ్వని యేపుణ్యాత్మునిదో తెలియదు? నాపతి వృత్తాంతము మృదుమధుర పదముల వర్ణించెను [అనుచునన్నిదిశలం గనుంగొని యశోకతరువునఁ గూర్చున్న యాంజనేయునింగని) ఆహా! ఉదయగిరిమీఁద, సూర్యునిరీతినొప్పుచున్న వీఁడెవఁడుండును కింశుకసుమకాంతి చేఁబోలుచున్న వాఁడు. (అనుచునాలోచించి) అకటా! వీఁడువానరుఁడుగానగపడెను. హా రఘూత్తమా! హా సౌమిత్రీ. నేనేమిసేయుదు? కలలో వానరుఁగంటిని. లేచివానరునిఁగంటిని. ఇంకముందినాకేమిచెడుగుమూడునో? నాప్రాణనాథుండుక్షేమముగ నుండునుగదా? ఈకపివరుండు నావిభుని వర్ణించుచుండెనేమో తెలియదు.

ఆంజనే:—(మెల్లఁగచెట్టుదిగివచ్చి సీతకునమస్కరించి) పతివ్రతాశిరోమణీ!

గీ॥ పన్నగస్త్రీవో కాదేనిభవునిసతివో
కిన్నరాంగనవో, లేక, కీలిచెలివో
గరుడకామినివో, గాక, కమలభవుయొ
ధాతయుపతిరొ, దెల్పు పునీతచరిత.

మానినీమణీ! నీమంగళరూపంబునుఁ జూచి, మానవనాథశేఖరుని రాముని మానిని వనితామానసంబు తెలుపుచున్నయది. అతిమానుషమగు నీ రూపనుఁ నీ దీనతయుఁ జూడఁగ, నీవు రామ మహిషివనిదోచుచున్నది. ఇద్వార్త నిజమగునేని నేధన్యుండ.

సీత:— గీ॥ జనకజను నేను దశరథునకు గోడ
లైనదానను, త్రిభువనజానినైన
పావనుని రాఘవుని ప్రేమపాత్రమైన
దానసీతను వినుమో యుదారచరిత.

హనుమంతుడు:—( నమస్కరించి )

శ్లో. వందేవిదేహతనయా పదపుండరీకం ।
కైశోరసౌరభసమాహృతయోగిచిత్తం?
హంతుం త్రితాప ? మనిశంమునిహంససేవ్యం
సన్మానసాలి-పరిపీతపరాగపుంజమ్.

( స్తోత్రపాఠములోనిది )

తల్లీ! పతివ్రతాశిరోమణీ! సాంగవేదము చాయవిద్యుత్తముఁడగు నీ వల్లభుఁడు రాముఁడు దేవాదిదేవుఁడు క్షేమముగనున్న వాఁడు నిజమిది. నీ కుశలమా రసిమ్మని దూతగనన్నంపినాఁడు. అతనిసోదరుఁడు లక్ష్మణుఁడు నీకు నభివందనములు తెలుపుమని పలికినాఁడు.

సీత:—(స్వగతము) ఆహా! నాఁడు మాయా సన్యాసియై రావణుఁడు మ్రుచ్చిలి, నను దెచ్చె. నేఁడు కపివేషంబుఁబూని నన్ను సమీపించినాడని సందియించెద. వీనితో మాటలాడుట తగదు. (అనుచు మరల చెట్టుక్రింద కుర్చుండును.) ఓరీ నిశాటా! ఘనతర శోకాగ్ని చేతఁగాగి యునిశ, ముపవాసకృశనై యున్న నన్ను నీవేలయిటు మోసగించెదవు? నీవు రాక్షసుఁడవు. నీవు నిజముగ రామ దూతవగుదువేని నీకు శుభంబగు గాదేని నీకు వినాశంబగుఁగాత.

ఆంజనే:—తల్లీ! నిజముగ నేను రామదూతను. పతివ్రతామణీ! ఆ దేవదేవుఁడధిక తేజస్వి. కుబేరసమాఢ్యు. సంపన్నుఁడు. సమవర్తిచందాన సత్యరక్షకుఁడు.

కందర్పునింబోలు సుందరుఁడు. వాచస్పతిని నిరాకరించు వాగ్విలాసుఁడు. ధనపతిని నిధిఃకరించు వైభవోపేతుఁడు. శాస్త్రకోవిదుఁడు. దివ్యాస్త్రవిదుఁడు. అట్టిరాముని కపటమృగాకృతి వంచించి నిర్జరారాతి నిను ముచ్చిలి దెచ్చె. ఆ దుష్కర్మఫలంబు వాఁడు శీఘ్రంబు ననుభవించు. నేనసురుఁడఁగాను. రామమూర్తి కింకరుఁడను.

సీత:—కపివరా! నీవెంత నిజమాడినను నేనది నమ్మఁజాల. ఆ రాముని మగణాభిరాముని దూతవు నీవనుటకు ప్రత్యక్ష సాక్ష్యమేమైన యున్న రూపల చూపింపుము.

ఆంజనే:— తల్లీ! నీవిటు సందియింతువని మున్ను మున్నుగ నా మహాదేవుఁడు దెలిసియుఁగాబోలు రామనామాంకితంబైన యంగుళీయకము ప్రత్యయార్థంబు నాకొసఁగినాడు. దీనింజూచి లిపిని నీమనంబునంబడిన సందియంబును, దుస్సహ సంతాపంబును బాయును. (అనుచు నంగుళీయకము నిచ్చును)

సీత:—( ఉంగరమును గంటికినొత్తికొని )

కం॥ అరిసూదను కరమున నీ
వరుదారఁగఁగాంతిఁ గాంచినట్టిమహిమ, సుం
గరమా, పాయుచునాదెస,
కరుదెంచితె కరుణఁబూని యధికాదరతన్.
( నీవుమాటలాడ నర్హుఁడవైతివి. )

సీ॥ భూరిశతయోజనాయ తాంబుధినిదాఁటి
కోటవాకిండ్లు బ్రద్దలుగొట్టి - లంకఁ
జొచ్చి, నేనున్న వనికినివచ్చి, నాథు
క్షేమమును దెల్పి, నే,మనఁజేసితీవు.

ఆంజనేయా! నీ సాహసంబునకు నేనెద మెచ్చితి. అయినను రామగుణానుకథనంబు నా వీనులకువిందుగా నుండును, గావున దానిని వదలఁజాలను. ఆ

సుగుణాభిరాముఁడు, రాముఁడు విన్నిచటికి బంపునపుడు నావిషయంబున నేమి పల్కెను. నాభర్త కన్నెఱ్ఱదైన దలఁచుచున్నవాఁడా? నా వియోగముల కొఱ్ఱదైన పరితపించుచున్నవాఁడా?

అంజనే:— తల్లీ! నీ వియోగమునుండి రాములకుఁగలిగిన చిత్తచాంచల్యంబు విచిత్రంబుగనున్నది. సూక్ష్మముగఁ దెలిపెద వినుము.

సీ॥ అనిలమునవని జాతాయనివిలపించుఁ
బలువృక్షములఁజూచి పల్కరించు
లలిమించు.నీదుసొంపులు చాలనుతియించుఁ
గంటిసీతయటంచుఁ గలవరించు
నవపల్లిలఁగాంచు నాతినీవని యెంచు
వేఁగ మెజనివానిఁ గౌఁగలించు
చిల్కపల్కులువింముఁ చెలియపల్కులటంచుఁ
బలుమాఱునుతియించుఁ బలవరించుఁ

గీ॥ చలువగాలికి సోలుచుజలదరించు
హితులవచనములను విననేపగించు
సరసిజాంబకు గాకలసంతపించు
సర్వదిశలనుమత్తుఁడై సంచరించు.

సీత:—అయ్యో! అట్టి దేవాధిదేవునకు నయిత మింతటి వియోగదుఃఖంబుఁ బ్రాపిల్లెనా? అంజనేయా! నా రాముని, వియోగంబున దశమాసములనుండి దుఃఖించుచు నెటులనో ప్రాణములు ధరించికొనియున్నాను.
ఇఁక రెండునెలలకు నాదుష్టాసురుని చెప్పుమునకు నే వశనుగాకున్నయెడల, నా యసువులు నశింపజేసెదనని శపథమొనర్చెను. అయ్యో! ఆ పాపిచే నా ప్రాణంబులు పోయఁజాలను. అట్టి సమయము రాకమును పు నాథ ర్త ననుఁగావరాఁడేని స్వహస్త మరణంబేకర్తవ్యంబని నా మనంబున నే నిర్ధారించినాను.
అంజనేయా! నాథర్త నన్నింతటి దుర్గతికిఁ దింపఁడుగదా.

ఆంజనే:—తల్లీ! వెరవకుము.

## అ ను బం ధ ము 22.

ఉ॥ పాపుదునీదుదుఃఖమును భానుకులాంబుధి సోముఁడింతలో
నీపురిఁజొచ్చి, రావణునినీయిలకున్వెలిఁజేసినీకుసుఖం
బ్రాప్తయియుండుఁ నమ్ముమయబద్ధముకాదిది, నమ్మవేని నా
వీఁపున నెక్కుమమ్మ నినువేగమెచేర్తును రాముసన్నిధిన్.

తల్లీ! అంతటిపనిసేయ నే సమర్థుఁడను! మాతా! పరపురుష సంటుట దోషమని సందియించెదవు కాఁబోలు. నిజము. ఈ దుష్టరాక్షసవధ యీ రాముని చేజరుగుట ధర్మము. రావణుఁడు పరాక్రమ రహితుఁడై ముచ్చిలి నినుఁదెచ్చినరీతి నేనుమరల నిన్నుఁదీసుకొనిపోయినచో, లోకులు నాయందును నా మహాప్రభుని రాముని యందును దుర్బలత్వం బారోపింతురు. తల్లీ! గడువుమీఱనటుల రాఘవునిఁ బిలిచికొనివచ్చి రాక్షసవధఁ గావించెద. పతివ్రతాశిరోమణీ! నిను నేను సందర్శనంబు చేసుకొన్నది నిజమని తెలియులాగున నీ భర్తకుఁ జూప ప్రత్యయార్థం బెద్దియైన నొసంగుము.

సీత:—(తన శిరోరత్నంబుఁ జేతనిడుకొని.) వానరాగ్రణీ! ఇదిగో నా శిరోరత్నంబు నాప్రాణనాథుని కేలందిడుము. నినునమ్ముఁడేని గాననంబున రహస్యంబుగ గాకాసురుని వధించినగాథ జానకి తెలిపెనని నాభర్తకు విన్నవింపుము. నావందనము లర్పింపుము. నా మఱిఁది సుగుణజాలంబరయంజాలక నిందించిన దోషఫలంబిపు డనుభవించెదనని సౌమిత్రితో నివేదింపుము. కపివరా! సురక్షితముగ బోయిరమ్ము. రాక్షసులిట సదాకాలంబు సంచరింతురు. నినుఁజూచిన చోఁ బట్టుదురు. కార్యభంగంబగునుగావున జాగరూకుఁడవై లంక వెడలుము. సమస్త దిక్పతులు నినురక్షింతురుగాత!

ఆంజనే:—(సీతకు వందనంబులర్పించి)

గీ॥ ముసలితనమెల్ల మర్త్యులవ్యసనమమ్మ
బీదతనమెల్ల జీవులపీడ తల్లి
సుతునిమరణమ్ముగాంచుట శోకమమ్మ
కష్టములనెల్ల నాకలికష్టమమ్మ.

తల్లీ! దూరప్రయాణాయాసంబున నాకలిగొన్నాను. ఈ వృక్షఫలములుగొన్ని మెసవెదను. ఆజ్ఞ యిడుము.

సీత—: కీశాగ్రణీ! ఈ వనము రాక్షసపాలితము. కావున హెచ్చరికగలిగి చప్పుడు చేయక ఫలములుగొని సురక్షితముగఁబొమ్ము.

ఆంజనే:—[దూరంబునకుఁబోయి]

కం॥ అంచితముగఁ గీనాశుల
చాంచల్యముఁ జూపునట్టి సమయముదోరికెన్
కొంచక కొమ్మలఁ బీకుచుఁ
బంచెదయమపురికి నసురబలముల నెల్లన్.

ఇపుడు నాపని వేఁజేసెద. మర్కట సాహసంబుఁజూపెద. మాంసఖండములు తిండిపోతులబలేఁదిన్న, కండలుమెండై కావలియుండిరి యీ రాక్షసాధములు నిద్రించినారు. దూరంబున నగపడు వృక్షశాఖలు వీరిపైఁద్రోసి వీరిని హెచ్చరించి పట్టిచంపెద. హతశేషులు గొండలివ్వార్త యీ దుష్టరాక్షసాధిపునకుఁ దెలుపుదురు. వాఁడు నన్నేమి సేయునో జూచెద.

కం॥ రావణుఁడొక్కండైనను
రావణశతకోటి యైన రానీ పోరన్
బోరాములఁ గెడపుచు నా
ధీరతనగఁబఱతు వాఁడుదిగ్భ్రమఁజెందన్.

ఈలంకాపురినాశనంబునకుఁ గారణభూతుఁడయ్యెద ( అనుచు అశోకవనాంతరములో జొచ్చును. )

( నిష్క్రమణము )

## తృతీయరంగము.

## అశోకవనము.

(ఆంజనేయులు - జంబుమాలి - అక్షుఁడు - ఇంద్రజిత్తు.)

జంబుమాలి:—ఓరీ మర్కటాధమా! లోకకంటకుఁడగు దశకంఠుని, పరాక్రమ మించు కేనియు నెంచక విజృంభించి యిచ్చట రాక్షసులను జంపితివియా? చైత్య ప్రాసాదంబు పడగొట్టితివియా? అశోకవనంబు భస్మంబుగావించితివియా? నీ సాహసమెంత నీ ధైర్యమెంప మర్కట చాంచల్యంబున హెచ్చినవాఁడవు నీవేను. ఇపుడే నిన్నుఁబట్టి వధించెద.

గీ. ఓరి! పిశితాశనాయేల నోరుమీఱి
కాలుకూఁతలు కూసెదు? జేసరార
కాలుసదనమ్ముఁ జేర్చెదఁ గదనభూమిఁ
దల్లిదండ్రుల నిప్పుడే తలఁచికొనుము.

ఆంజనే:—ఓరీ పిశితాశనా! ఒకరాక్షసాధముఁడైన రావణుని బలము భద్రా జూవరేఁ బొగడుచు నన్ను భీతిలఁజేయ యత్నించెదవా? ఒక రావణుఁడే గాదు. రావణ సహస్రములనైన రాముని కరుణా విశేషమున రణరంగంబునఁ జంపుదు. లంకను నగ్నిహోత్రమునకు బలియిచ్చెదను.

జంబుమాలి:—ఓరీ నొక హీనమానవుని దాసుఁడవై నీ ప్రాణములపై నిరాశగొనుట మేలుగాదు. ఇదిగో యీ బాణమున నిన్నుఁ బుడమిం గెడపెద. (అనుచు బాణము ప్రయోగించును.)

గీ. హీనమానవదాసుఁ డవైన - మర్క
టాధమా నన్ను గెలువఁగ నౌనెనీకు
శలభమునకును వహ్నితో సరసమగునె?
కోఁతిచేష్టలు వదలుమా కూఁతలిడకు.

ఆంజనే:—ఓరీ రాక్షసాధమా! ఇదియేనా నీ బాణప్రయోగ కౌశల్యము?

ఇదిగో నీ బాణమును నాహస్తముచే నఱికితిని. బుద్ధితెచ్చుకొని వేఱొక బాణంబుఁ బ్రయోగింపుము.

కం॥ కరమునఁబట్టితి నీదగు
శరవారము నెల్లఁ గనర, శక్యమెపోరన్!
గరబేలమునన్ వచ్చిన
హరియింపఁగఁ బూనఁగునె, యంగముకోలున్.

జంబుమాలి:—ఓరీ హీనకపీ! నీవొక హీనవానరుఁడవని తీవ్రబాణంబుఁ దొడఁగనైతిని ఈనూతన తీక్ష్ణబాణంబున నీ శిరంబుఁ దఱిగెద. [అనుచు బాణముప్రయోగించును.]

కం॥ కరవారముఁ బూనుచు నీ
శిరమున్ దఱఁగుఁను, గనరశీఘ్రుఁబున, నీ
ధరకున్ బలియిచ్చెద, వా
నరుఁడని వదలుదునె నిన్ను నగచరహీనా,

ఆంజనే:—ఓరీ అసురాధమా! నీ నిశితబాణంబు నాహస్తభూషిత వృక్షశాఖచేఁ బడగొట్టితిని. నీకు శస్త్రశిక్ష యలబడ్డదికాదు. శాస్త్రశిక్ష ప్రారంభమునే లేదు. గురుశిక్షఁ గుఱ్తెఱుఁగవు. కావుననె, నాశిక్షకుఁగాను నన్ను సమీపించితివి. ఇదిగో నీకు బుద్ధిఁగఱపెద.

కం॥ రావణదాసా, యిఁకనా
లావునుబీరమ్ముఁ గాంచిలజ్జింపుమ, నీ
చావిదె వచ్చెనుగనుమా
భూవనితను జేరిసుఖముఁ బొందుమవేడ్కన్.
(అనుచుఁ చేతనుండు శాఖచే వానినీఁదన్నును. జంబుమాలి విసరికొనిపోయి దూరంబునఁబడును.)

ఈక్షుద్రరాక్షసుఁడు నాచే హతుఁడయ్యెను. ఇవ్వార్త రావణుని కందును. ఆ దుర్మార్గుఁడు మఱియెవ్వరిని బంపునో జూచెద. అదివఱకును నీ యశోక

వనము మిగతభాగము మూలమట్టముగఁ జెఱిచెద. (అనుచు సంచరించు చుండును]

( అక్షయ కుమారుని ప్రవేశము. )

అనుబంధము 23.

అక్షయ:—[ ఆంజనేయునిఁజూచి] ఓరీ వనచరా! నీ వెవ్వఁడవు? నీయశోకవనంబేల జొచ్చితివి? యీ వననాశనంబేల గావించితివి?

ఆంజనే:— ఓరీ! రాక్షసబాలకా! రామునిదూతను. నేనిటురాక, యీ వనము నాశనంబు జేయకున్న నిన్నెట్లు జూచుచుంటిని.

అక్ష:—నన్నుఁజూడ నశక్యంబేమి.

ఆంజ:—కాలునిప్రోలికి నిన్నుఁబంపుటకు.

అక్ష:—కం. ఫలములమెసవినమత్తుత
తలతోఁకలెఱుంగ కీవుతగు నేపలుకన్
పలువా! నీపొగరున్ డించెద
గలనన్ ముందరికిరమ్ము కలఁతున్ చెఱుతున్.

ఓరీ! బొగురుపోతా! మర్కటాధమా! మితిమించి మాటలాడకు. సకల దిశాధి నాథులను జెఱబట్టి దాసులనుజేసిన దశకంధరుని సుతుఁడను నేను.

ఆంజ:—రాక్షసార్భకా! అటులయిన నీతండ్రిని జతజేసిఁ నిన్ను యమపట్టణంబునకుఁ బంపెద.

అక్ష:—ఓరీ! వానరహీనా! నీతో మాటలాడుట నను బోలు మానసీయునకు ధర్మంబు గాదు. ఇదిగో యీ నాబాణంబున నీ రుధిరంబు ప్రవాహంబుకీతి పాఱించేసి దేహంబు నేలంగెడపెద.

ఆంజ:—గీ॥ తప్పదీనాఁడుచావని తల్లికీవు
తెల్పిరావయ్యబాలకాయల్పమతిని

పులిగుహంనుజొచ్చుమేకతాఁ బాలియకున్నె
హరిని నెదిరిన నిలుచునే హరిణమవని?

అసురబాలకా! నీవుసురు నేటికి తుదియని నీతల్లికి జెప్పివచ్చితివియా? ఇత్తడై నను బోయి తెలిపిరమ్మ.

అక్ష:— కం॥ కులాయికోఁతిపీవిటు
పిల్లలతోనాడికొనక పెంపువహింపన్
చెల్లునె యిదెనినుఁజంపుచు
దల్లింజేరంగఁబొమ్మెదను మోదమునన్.

ఓరీ! మర్కటా! నినుఁజంపి యిలకుబలివైచి మోదమున నాతల్లింజేరెద.

ఆంజ:— ఓరీ! బాలకా! నీ తల్లిని మోదమునఁ జేరెదవో? ఖేదమునఁ జేరెదవో? కాదేని మోదఖేదములు రెండును లేనితానముఁ జేరెదవో? ఓరీ! నీకు బాణవిద్య యించుక తెలియునని నే గ్రహించితి. అయినను సంపూర్ణజ్ఞానంబు నీకుఁబట్టుబడలేదు.

సీ॥ "అల్పవిద్యామహాగర్వి" యనెడురీతి
నిక్కనీల్గకుబాలకా యుక్కువీడు
లక్కముక్కటుగాల్చురా? నిక్కమెఱిఁగి
గృహముఁజేరరనీకగు కీడుదప్పు.

"అల్పవిద్యా మహాగర్వి" యనురీతి నల్పవిద్యచె నిక్కుచున్నావు. ఇదిగో నాముష్టిఘాతంబున నినుబట్టి చీల్చెద జూడుము (అనుచు అక్షయకుమారునింబట్టి మల్లయుద్ధంబొనర్చును. అక్షయకుమారుఁడు నేలఁబడును.)

ఆహా! వీఁడు రావణుని సుతుఁడేను. బాలుఁడైనను పరాక్రమవంతుఁడు. వీని బాణంబు నను నొప్పించెను. వీనిమరణంబువిని రావణుఁడు కోపమాకృతిఁగొనినరీతి విజృంభించి నను జంపవచ్చును. అప్పుడుగదా! నా పరాక్రమ మంతయుఁ జూపసమయంబుఁగలుగు. (అనుచు లోపల సంచరించుచుండును)

( ఇంద్రజిత్తు ప్రవేశము. )

ఇంద్రజిత్తు:—(అచ్చట పడియున్న యక్షయుని జూచి) అయ్యో తమ్ముఁడా! అక్షయా! ఒక్క క్షుద్ర మర్కటమునకు నీవు జిక్కితివా? ప్రాణంబుల నీఁగితివా? బాహుబలంబునను, మంత్ర నిశ్చయంబునను, సాహసనైపుణ్యంబునను, శౌర్య సాహసోత్సాహంబులను బాలుఁడవైనను, భవత్సముఁడీ ధారుణి యందెవ్వఁడుండ లేఁడుగదా? ఇట్టివాఁడవు నీ వెటులీ మర్కటాధమునకుఁ జిక్కితివి? ఆహా! బ్రహ్మ వ్రాఁతఁ దప్పింప నా తరమా? నిను బాధించిన మర్కటమును నేఁడు బట్టి వైరశుద్ధి నందెద. (నడుచు దూరంబుననున్న యాంజనేయుని జూచి) ఓరీ మర్కటాధమా! దూరంబున కేల యేగెదవు? నన్ను సమీపింపుము. నీవు నేఁడు యమమందిరంబు సమీపంబుగ నున్నాఁడవని తెలిపెదను. ( ఆంజనేయుఁడు మెల్లఁగ వచ్చి )

ఆంజ:—ఓరీ! రాక్షస వంశపాంసనా! నీ వెవఁడవు? నీవు చిరంజీవివని ధాత నీకెవ్వఁడైనను తెలిపెనా? కాదేని నన్నెదిరింపవచ్చుటకు నీకు సాహసమెటుగలిగె? నేను రామదూతనని నీకుఁ దెలియదా?

ఇంద్రజిత్తు:—ఓరీ! మర్కటా! నీవు రామదూతవు. కావుననే యమదూతలు నిన్నతి లోనే వెన్నంటుదురు. నే నెవ్వఁడైనది నీకు దెలియదు కాఁబోలు. నే రావణ సుతుఁడను. ఇంద్రజిత్తును. ఇంద్రుఁడొక్కఁడేగాక సమస్తదిక్పతులు వచ్చి నన్నెదిరించినపుడు వారిని జయించి యింద్రుని జెఱబట్టితిని గావునని యింద్రజిత్తని నాకు నామంబు గలిగెను. వేగమున బవనుని ధిక్కరింతును. పేడిమిఁ బావకుని నిరాకరింతును. తేజంబునందు పవనుని యోజ చెఱచుదును. నిన్నుం బరిమార్చి నా సోదర మరణంబునకు బ్రతీకారంబొనర్చెద.

ఆంజ:—ఓరీ! దుష్టాసురా! నీ సోదరు మరణంబువిని నీ తండ్రి ననుందాఁకునని యూహించియుంటిని. నా సామర్థ్యంబు వానిం దాఁకకుండ నుంచుకొనియుంటిని. నీ మరణానంతరము నీ తండ్రి పుత్రరహితుఁడగునేయని చింతించెద. అయినను వైరిపోరున కెగిరినప్పుడూ రకయుంట వీరధర్మముగాదు. గావున నీతోఁ బోరొనర్చుటకు సిద్ధుఁడగుచున్నాఁడను.

ఇంద్రజి:—ఓరీ! సమస్త లోకములను జయించి కైలాసగిరిని బంతివలె వాడించిన నా తండ్రి, వానరాధముఁడవగు నిన్నుదాఁకునా? పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా? ఇదిగో యొక్క బాణంబుననే నీ యుక్కడంచెద ( అనుచు బాణంబువేయును )

## అనుబంధము 24.

ఆంజ:—( ఆ బాణంబును నడుమనే ఖండించి వృక్షశాఖచే నింద్రజిత్తునుదన్ని ) ఓరీ! ఇంద్రజిత్తా! నీ బాణంబు వ్యర్థమయ్యె. నా దెబ్బ నీ శరీరంబున ఋణముగ నిలిచె. దానికింబదులుబంపెదవా?

ఇంద్ర:—ఓరీ! నగచరా! మఱియొక తీవ్రబాణంబున నీశరీర మగల్చెద జూడుము.

కం॥ తర్కములుచాలు చాలును
మర్కటహా సుడుగులుడుగుమా, యిదె కనుమా;
కర్కశబాణంబును, నీ
వర్కునిలో కంబుఁజూడ నరగుము వేగన్.

ఆంజ:—ఓరీ బలహీనా! పిశితాశనా! నీ బాణంబు నా దేహంబున కెక్కదయ్యె. గావున నీ బాణంబులు నన్నంటవు. మల్లయుద్ధంబున నీ పౌరుషంబుఁ జూపు ము. అనుచుమల్లయుద్ధమునకు పైఁబడును (ఇంద్రజిత్తు క్రిందబడి మరలలేచి దూరమునకువచ్చి).

ఇంద్ర:—ఆహా! ఈ వానరుఁడసమాన భుజాబల విజృంభణముగలవాఁడు. వీనింగనిన నవధ్యుఁడని నాతండ్రోఁచెను. కావున బ్రహ్మాస్త్రముచే వీనిని బద్ధునిఁజేసి నా తండ్రి సరసకుఁ బట్టికొనిపోయెద.

( అనుచు బ్రహ్మాస్త్రంబు బ్రయోగించును. )

ఆంజ:—(ఆంజనేయుఁడు బ్రహ్మాస్త్రబద్ధుండై.) ( స్వగతము.) అహా! పరమేష్ఠివరబలంబునతియీయస్త్రంబు నను బాధింపదు. అయినను బాధింపంబడినవానిబలెనటించి రావణుని యాస్థానంబుఁ జేరెద.

సీ॥ రామపరంధామ రవికులార్ణవసోమ
కామరామా రమారామరార,
నిర్వికల్పారార నిర్వికారారార
నీలమేఘశ్యామ నీవురార,
సగుణనిర్గుణరార సద్గుణాకరరార
రాభవదుఃఖవిరామగార,
సర్వలోకాధార సత్యనిత్యవిహార
రామరక్షోగణభీమరార,

గీ॥ రారరామా త్రిలోకాభిరామ విజిత
రామ శ్రీరామ రఘురామ రామచంద్ర
జానకీరామ నృపకుల సార్వభౌమ
విభవసుత్రామ త్రైలోక్య విమలనామ.

[ రాక్షసులువచ్చి ఆంజనేయుని బంధించి లంకకు పిలుచుకొని పోదురు. ]

[(నిష్క్రమణము.)

ఉ॥ రాజకులాభిరాముఁ డరిరాజవిరాముఁడు రాక్షసాంతకుం
డాజిని శత్రురాజిఁ దెగటార్చు పరాక్రమధాముఁ డింపుగా
నేజవసత్త్వము న్నెఱపి నీరధి దాఁటితిఁ బిల్లకాల్వగా
మాజనకాత్మజన్ భువనమాతను నారయఁ గార్యధుర్యుఁడై.

రావణా! వానరవంశ వారిధిచంద్రుఁడైన సుగ్రీవుఁడు నీ క్షేమంబడిగెను. మఱికొన్ని హితవచనంబులు నీకుం దెలుపుమని పలికెను. వాసవునకు సమానుఁడై ప్రజలను బుత్రులవలెఁ బ్రోచుచుండిన దశరథునకు నగ్రసుతుండు రామచంద్రుఁడను మహనీయమూర్తి పితృవాక్య పరిపాలనంబునకై భార్యానుజసమేతుఁడై జటాజినములు ధరించి దండకారణ్యంబున సంచరించుచుండ నమ్మహాత్ముని భార్యయగు సీతను బద్మకులజాతను కల్యాణగుణ సమేతను త్రిజగన్మాతను నీవు ముచ్చిలి తెచ్చితివఁట. అద్దేవినిఁ గానక యా రఘువల్లభుండు వెదకుచు ఋష్యమూకంబునకుం జనుదెంచి సుగ్రీవునితో సఖ్యమొనర్చి యాతని పగతుఁడగు వాలిని నతిబలశాలిని, నవలీల నొక్కకోల నేలంగూలనేసి వానర రాజ్యంబు సుగ్రీవున కొసంగెను. వాలిపరాక్రమంబు మున్న నీవు దెలిసినవాఁడవెగదా? అట్టిరామునకుఁ బ్రతికారంబొనరింప సీతాన్వేషణమునకై దశదిశలకు వానరులను బంపినారు. ఆ వానరులు వైనతేయ సమాన వేగులు. అట్టివారిలో నేనొకఁడను. సమీరునకు వానరిని సుతుఁడను. హనుమంతుఁడని నా నామంబు. జానకిని వెదుక సాగరము దాఁటి నీ యశోక వనమధ్యంబున నా లోకమాతనుగంటిని. రావణా! నీవు ధర్మాత్ముఁడవు. తపంబు పెంపున తేజంబు బడసినావు. పుణ్యుఁడగు బ్రహ్మకులమునఁ బుట్టినావు. అట్టివాఁడ వన్యదారలఁ బట్టఁదగునే? అతినింద్యము, కులనాశకరము, ధర్మవిరుద్ధము, దుష్కర్మము తెలివిగలవారు సేయఁదగిన కార్యమా? వీరవరేణ్యుఁడగు రఘువీరునకు నాగ్రహమొనరించి దేవదేవాదులకైనఁ బ్రాణముననుండ సాధ్యమా? నా పలుకు నమ్ముము. సీతను లోకమాతను రామునకిచ్చి పురదార సుతాదుల రక్షించికొనుము. నేనొక్క ముక్కడి మృగమును సాగరంబు దాఁటితి. వనంబు భగ్నమొనర్చితి. పలువుర దైత్యుల వధించితి. నావలనే యింతపని యాయెనఁట. ఇఁక రఘురాముఁడు వచ్చి పోరున, నీ శిరంబులు త్రుంచి వైచినఁ గొనెదవో.

పును. రావణా! ఆసీత, నీపాలి పంచముఖ పన్నగియని తెలియుము. ఆ పావనశీల శోకశిఖి నీపురిని భస్మముఁజేయును. అసురవరా! గరళసమ్మిశ్రితాన్నంబు భుజించిన నదియఱుఁగునా? సురాసుర యక్షకిన్నర గరుడోరగాదుల వలన చావులేకుండ ధాతచే వరంబుఁగొంటినని గర్వింపకు. రాముఁడు హరి కులమునఁబుట్టిన మహాబలుఁడు. మఱియు బూర్వసంచిత మహనీయ ధర్మవిశేషంబు నినుఁగాచునని దలంచితి వేని, నది యిపుడధర్మ ఫలంబులోఁ గూడెను కావున భోగ్యంబు కానేరదు. తేజస్తిమిరంబులకుఁబోలెఁ ధర్మాధర్మంబులకు విరోధంబు! ఇంతపర్యంతము నీవు ధర్మఫలంబనుభవించితివి. ఇపుడో పరదారాపహరణమను నధర్మ ఫలంబనుభవింప యత్నింపకు. నిన్ను పోరున బంధించి చెరనుంచిన కార్తవీర్యార్జునుని రూపుమాపిన వాఁడు పరశురాముఁడుగదా! అట్టి పరశురాముని రూఁపుమాపి వానిచాపంబుద్రుంచి దేశభ్రష్టునిఁ గావించిన వాఁడాపరాక్రమశాలి రాముఁడు.

రావణా! సముద్రతీరంబున నిన్నుఁబట్టి తోకంజుట్టుకొని సప్తసముద్రములలో ముంచి వాసునిబలె నింటనుంచుకొనినవాఁడు మహాసత్వశాలి వాలిగదా? అట్టి వాలిని నొకకోల నేలంగెడపిన పరాక్రమశాలి రాముడగునుగదా? నీ వెవ్వని గుఱించి తపంబొనరించి వరంబులుబడసితివో, యా దేవదేవుఁడీశ్వరుఁడుగదా! అట్టి యీశ్వరుని చాపంబు నవలీలగవిఱిచి సీతనుఁగైకొన్న సత్వసంపన్నుఁడు రాముఁడుగదా? రాక్షసేశ్వరా! ఇవియన్నియుఁ జక్కఁగ నాలోచింపుము. దశాశ్యునిఁ బోరునవధింతునని యా రాముఁడు ప్రతిజ్ఞ యొనర్చెనుగావున నేనూరకుండవలసె. నా స్వామి యనుజ్ఞ నాకు నుండెనేని, నిన్నును నీవారిని నేనొక్కఁడేవధింపఁజాలుదు. రావణాసురా! సీత కేవలమర్త్యకాంతయని నీవు తలంపకు. నీకులముఁగూల్పఁగఁబుట్టిన కాళరాత్రియా నీరజనేత్రి. సీతావిగ్రహరూపంబగు కాలపాశంబునం గట్టుబడితివి. నీవిఁక నేరీతిజీవించెదవో తెలియదు. నా వచనంబు సత్యంబు. అట్టి రాజసింహునకు, విప్రకారంబు జేసితివి. విపత్తు దెచ్చికొంటివి. అగ్గితో దలఁగోకికొంటివి. ఇపుడైనను దెలిసి దెచ్చుకొనుము.

రావణు:— సీ॥ వనచరసీవొక ఘనమనుజునిఁబోలె
వచియింపనిప్పుడే వనధిముంతు

హను:— సప్తసాగరములు చవుటికాలువలుగఁ
జేయఁజాలినవన్ను జెనకవలదు

రావణు:— నిన్ను నీరాముని నీలుఁగావించుచుఁ
జెన్నొందువాఁడను సీతఁగూడి

హను:— సీతజగన్మాత సీతలలకుఁగోత
రోఁతకూతలనాడిఖ్యాతి చెడకు

రావణ:— నీచమానవునేకు నిత్యమంగళమగు
సీతదారఁగ నుంటరోఁతకాదె?

హను:— నినుచతురబ్ధిలో నీర్గముంచినవాలిఁ
గోలఁజంపిన బలశాలియతఁడు

రావణు.— తాపసివేషంబుఁ దాల్చి ఘోరాటవిఁ
దిరిగెడువాఁడెటుధీరుఁడగును?

హను.— కార్తవీర్యార్జు నుఁగలను లోఁజంపిన
పరశురాముని బాణహరుఁడతఁడు

రావణ.— గీ॥ కోఁతికినినీకు గర్వముకూఁతలేల?

హను.— ధాతవంశము గూల్పగఁదలఁతువేల?

రావణ.— నీతిబోధింప - ధరగోఁతిజాతికగునె?

హను.— జాతివిఖ్యాతి నెఱుగని కోఁతివీవె

రావణ.— ధీరవరులార చంపుఁడీవీనిఁబట్టి

హను.— దశరథునిపుత్రదాసునివశమె చంప?

రావణ.- (లేచివచ్చి) నేనుజంపెద గాంచుమానిన్నునిపుడె

హను.— పలువకూఁతలు గూసినఫలముగలదె.

రావణుఁడు:—(రాక్షసులంజూచి.) రాక్షసవరులారా! యీకోఁతినిఁబట్టి నాయెదుటనె చంపుడి.

విభీషణు:—అన్నా! తాలిమివహింపుము. రోషము విడుపుము. దూతలయవధ్యులని శాస్త్రజ్ఞులు పలికినందున నీవీఁడు గర్వించి మాటలాడెను. ఈ వనాటునిఁ జంపుట హితముగాదు. రాజధర్మ విరుద్ధమది. నీవు ధర్మజ్ఞుడవు. కృతజ్ఞుడవు. పరాపరజ్ఞుడవు. రాజనీతిజ్ఞుడవు. నీయట్టి పండితుఁడు రోషంబు గైకొనఁ జెల్లునా? ధర్మవిరుద్ధంబు లాచరింపనగునా? సనాతనరాజనీతి రీతి యుక్తాయుక్తంబులు నిశ్చయించి దండనీతి నవలంబింపుము.

రావణ:—అరిసూదనా! విభీషణా! పాపాత్ముఁ జంప నే పాపంబును రాదు.

విభీషణ:—అన్నా! నేఁ జిన్నవాఁడను. నినుఁ గూర్చి ధర్మార్థతత్త్వ మెఱిఁగినాను. ఈ వానరుఁడు నీ కెగ్గొనరించినది నిజము. వీఁడు నీకు వైరి. వైరుల జంపుట ధర్మము. దూతనుఁ జంపుట యధర్మము. దూతగర్వించి పలికినచో నరిగ వైరూప్య మొనరింపందగు. కాదేని కశాభిఘాతంబున నొప్పింపనగును. ఈ కపినిఁ దునిమినమాత్రాన నీకేమియు లాభము లేదు. వీనినిచ్చటికిఁ బంపిన శాత్రవునిపై గినుకవహింపుము. లేమ స్వామిపలుకులు దూతలు పలుకుదురు. దానికి దూతలు పూటకాపులు గారు. మఱియొకటి వీనినీవు జంపితివేని, నీ శత్రువు లిచ్చటికి రారు. నీకు శత్రుక్షయంబు సమకూరదు. సురాసురులకు దుర్జయుండవైన నీకు నొకపగవాఁడు ప్రపంచంబునం గలఁడనుట సరి కాదు.

రావణు:—తమ్ముఁడా! నీవుపలికిన విధంబు రాజనీతియుతంబు. వానరులకు వాలము భూషణము వాలమునుఁ గాల్పనగును. దగ్ధవాలుఁడై వీఁడుండె వానరకులము ఏఁక చెడును. ( రాక్షసులంజూచి ) రాక్షసవరులారా! వీనింబట్టి వాలంబునకు బట్టలఁజుట్టి నిప్పుదవిలించి రాజవీథులం ద్రిప్పి విడువుఁడి.

( రాక్షసులు ఆంజనేయుని బట్టుకొందురు. )

ఆంజ:—ఓరీ రావణా! నేను రామదూతను కావున రామునిప్రతాపవహ్ని నాలో జ్వలించుచున్నది. సీతాసతీనిశ్వాసవాయువహ్ని నను జ్వలింపఁ జేయుచు నీపురిఁ గాల్పుమని నన్నుఁ బ్రేరేపించుచున్నది. నన్నుఁ జెనకకు హెచ్చరికసుమా.

(రాక్షసులు బట్టుకొని పోవుదురు. )

ఉ॥ రామునిదూతనేను వినురావణ సజ్జనకంటక నేలరా?
రాముప్రతాపవహ్ని హృదిరాఁజుచునున్నది యెల్లకాలముస్
రాముని దేవి శ్వాస పవనమ్మిదె దానిని రేఁచి లంక ని
ర్ధూమగృహంబుఁ జేయుమనితొందర వెట్టుచునున్న దిప్పుడే.

ద్వితీయ రంగము.

అ శో క వ న ము.

సీత:—(సుందరిభాగమునకువచ్చి) అహా! నా భర్తదూతయగు కపికుంజరుని. కాకు మనినిబూని, నష్టాత్ముఁడగు రావణుఁడు వాలాంతమున హుతాశనునిదరికొల్పి వీథివీథులఁద్రిప్పుచున్నవారఁట. కటకటా! ఆత్మహరణోపమంబైన క్రూరవాక్యంబులువిని శోకసంతప్తచిత్తనైననాకు నిద్రయుఁ దోఁపకయున్నది. (ఆలోచించి) దీనినిమాన్ప నదుపాయంబు హవ్యవాహను బ్రార్థనయే గదా? (అనుచు చేతులుమోడ్చి నిలుచుకొని)

కం॥ పతిసేవయుఁ దపమును సం
తతముగ నేఁజేసితేని ధర్మనిరతయౌ
సతినగుదు నేని, దహనుం
డతిశైత్యముదాల్చిబ్రోచు హనుమంతునయున్.

కం॥ ఆరాముఁడు తనసతిపైఁ
బోరామియునించుకైన బొందుగగ నేనే
యీరామభక్తు, దహనుఁడు
కూరిమిశైత్యము వహించుకొని దాఁబ్రోచున్.

కం॥ ధర్మాత్ముండా రాముఁడు
నిర్మల, దనదారయనెడు నిజముదెలిసెనే

అర్మిలిసతి నేనప్పుడేన్
గూర్మినిదహానుండు గీశకుంజరుఁబ్రోచుట.

( చందనంబిడి నిష్క్రమించును. )

## తృ తీ య రం గ ము.

( హనుమంతుడు రాములకు వందనంబొసర్చి )

కం॥ కంటినిసీతను లంకన్
కంటకమతియయిన పఙ్క్తికంధరుపుర్కి,ని
ష్కంటకవృత్తినిఁ గాల్చితి
వెంట నెనీరధిని దాఁటివెడలితినిటకున్.

రాములు:—కపివరేణ్యా! పవనతనూజా! నీ సాహస పరాక్రమంబులు పరికించి బహూకరింప బ్రహ్మకైన నలవిగాదు. పవమానతనయా! ఆ యవనిజ లంకలో నెచ్చటయున్నది? ఎటులున్నది! వివరముగఁదెల్పి నా మానసంబునకు నాహ్లాదంబుఁగలిగింపుము.

ఆంజనే:—రామా! రామభద్రా! ఆ లంకను సువర్ణ పత్రపుష్పమయ తరుమూల మందా కోమలగాత్రయున్నది. ఇఁకెటులున్నదని యడిగెదవా? శోకకరంబయినను దానినిఁ బలికెదను వినుము.

సీ॥ నిరశనవ్రతమూనినిరతంబువ్యసనాగ్ని
వేఁగుచుండును సీత, వివిధగతుల
స్వేదవారిధిలోనఁ జేలంబుఁదడుపుచుఁ
గన్నీరుఁదుడుచునుగాదెసీత
నిట్టూర్పుసెగలచేసీరే జవదనంబు
వన్నెవాసియుఁ జెడివాడువాతె
నిరతవియోగాగ్ని నిగిడినఁదపియించు
విలపించుగతమునువెతలనెంచు

సీ॥ "రామ రామా" యనెడు నామమే మాటిమాటి
కెల్ల కాలంబు ధ్యానించు నెంచు మదిని
గఠినభూమిని బవళించుఁ గలవరించు,
నీదు చరితలు, రఘురామ, యాచరించు.

రామా! చైత్యవనితలు నీ దేవిని పరుషోక్తుల భాషించి దూలనాడుచునుండ సీత యా ప్లవబాంధవుని నొక్కని నచ్చటఁగానక, "ఆహా! రాఘవా ఆపదలను నన్నుగ్గుఁజేసితివే" యని పలుమారును నాడుచు జెక్కుటఁ జేయిఁజేర్చి చింతల నుందుచున్నది. రామభద్రా! దశకంధరుఁడు దుర్వాక్యముల నొప్పించ "అలకా మనజాలనని" పొలయుచు తెంపున మేనుఁ దాయుదుననుచు, సాహసించు సమయమున నేనాదేవి కన్న రసాయనమ్ముగ మాటలాడి రాముని దూతనని విన్నవించి ముద్రిక నొసంగితి. మరల నీ క్షేమవార్తలు దెలిపి పోయివచ్చెదనని సెలవడుగ యా పతివ్రతా శిరోమణి తనశిరోరత్నంబు ప్రత్యభిజ్ఞానంబు నీకందిమ్మనిరో (అనుచు శిరోరత్నంబు శ్రీరామునికిచ్చును)

రామః—(రాముఁడు దానిం జూచి) కపివరేణ్యా! దూపను ధేనువు ప్రేమతోఁ జాలు చేసినరీతి యీ చిత్ర మణిభూషణము నా హృదయమున సానందము కలుగఁజేసెను.

తే. గీ॥ సీతజాక్షిని గానక నిమిషమైన
విరహతాపంబు సైఁచి ప్రవృత్తి నూఁది
యుండఁజాల మహీసుత యున్న దేశ
మునకు వెసనన్నుఁ గొనిచను మనిలతనయా.

ఆంజనేయా! ఇఁక మనమిచట నాలసించిన నా వియోగదుఃఖంబున ప్రాణాపాయంబునకు నాదేవి సాహసించునేమో? కావున మనమాలసింపక లంకఁజొచ్చి రావణుని ద్రుంచి జానకిఁ దేవలెను. సుగ్రీవా! ఈ దినంబుననే నీ బలంబెల్ల కూర్పుము. దండయాత్రకు శుభదినంబు వెల్లడపుఱచుము.

అనుబంధము 25.

నిష్క్రమణము.

సంపూర్ణము.

దురామూనా నీ శిరము ద్రుంతు మదిని నమ్ముమా ||పో||

ఇంద్ర:- బాలక ప్రాణము బాయుకుమా
నీ చేరును నీకు పురివేగ

అంజ:- చాలు చాలు నీ పౌరుషముల్ నీ
వేశ్చెద దూతను యమపురి నిక

ఇంద్ర:- ప్రల్లదంపు పలుకులు సహింప నోపనేనునూ

అంజ:- పోరనీదు శిరికిపలుకులకు నైవెరవనూ
దురామూనా నీ శిరము ద్రుంతు మదిని నమ్ముమా.

* 76-వ పుటలో ఆంజనేయుడు “ ఇప్పుడైనను తెలిసి చెప్పుకొనుము ” అను మాటలయినచే యీ పాటపాడవలెను.

మోహన రాగము-ఆదితాళము.

అంజ:- రామదూత నేను కానరా ఓ రావణా||పల్లవి||
మాననీయుడైనరాము - సేనలోన నేను నొకడుకానవేర
కావరమును, బూనిచా నిభూని జలము ||అ||
లోకమాత సీత కానరావకే రావణా
లోకమాత ఖ్యాతసీత సోకనీకు సాధ్య
మేర నీకుబుద్ధిమాన లేని నీకులంబు నీరుగలయు.

5720

అ ను బ ం ధ ము 25.

కేదార రాగము - రూపక తాళము.

శ్రీకమలకాంత - గోకులవిఖ్యాత - సుస్వాంత సురమునిగణనుత -
విభువరనితాంత - నితాంతప్రణుత - సుజన - సురవర - తరు ||శ్రీ|| ౧||
సుందరమోహినివేషా - నందానందితభా - మధుససంతోషా -
సకలగుణ తమోహరణ నిఖిల జగత్రాణశరణా -
శుభము నిమము క్షేమలవసన - శుభములిమ్మ గొలుతునిన్ను ||శ్రీ|| ౨||